# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక"—

ఫేవీ ఫెయిరీ

"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ వస్తువైనా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

కిట్టీ కేట్ (కొంటెపిల్లి) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం యీ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

కిట్టీ కేట్ (కొంటెపిల్లి) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం కూపన్‌ను "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020 చిరునామాకు పోస్టు చెయ్యండి.

పేరు ______________________

వయసు ______________________

చిరునామా ______________________

నగరం ______________________

రాష్ట్రం __________ పిన్ __________

మీకు మా వద్ద నుండి 'ఫెవీ క్రాఫ్ట్' అందిందా? అవును/కాదు (C)

## ఫెవికాల్ ఎమ్ ఆర్

సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

OPM-4103 TEL

DECEMBER- 84

# శ్రీమతి ఇందిరాగాంధి



"నువు ఆనందభవన్‌లోనూ, మీ అమ్మ మలాకా జైల్లోనూ కూర్చుని వున్న ఈ సమయంలో నేనిక్కడ నైనీ జైల్లో వుంటున్నాను. ఒకరినొకరు ఎడబాసి దూరంగా వుండడం మనకెంతో కష్టంగా వుంది కదూ? అయినా మనం ముగ్గురం కలుసుకునే రోజును తలుచుకో! నేనూ ఆ రోజు కోసం ఎదురు చూస్తున్నాను. ఆ ఆలోచనే నా మనసును తేలికపరచి, సంతోషం కల్గిస్తున్నది."

ఇలా రాశాడు ఒక తండ్రి, తల్లి కూడా గారే జవహర్లాల్ నెహ్రూ. కూతురు జైల్లో వున్న తన కుమార్తెకు. ఆ తండ్రి ఇందిర. 1917 వ సంవత్సరం నవంబర్

19 వ తేదీన జన్మించిన ఇందిర, పెరిగి పెద్దదై భారత ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీగా, ఇరవైయవ శతాబ్దంలో ప్రముఖ నాయకురాలుగా పేరుగాంచింది.

సుప్రసిద్ధులైన మోతీలాల్ నెహ్రూ మనమరాలిగా, జవహర్లాల్ నెహ్రూ కూతురుగా జన్మించినప్పటికీ ఆమె భోగ భాగ్యాలతో తులతూగిందని చెప్పలేము. ఎందుకంటే అవి క్లిష్టమైన రోజులు. ఆమె తండ్రిగారికి భారతదేశ స్వాతంత్ర్యమే ప్రధాన లక్ష్యంగా తోచింది. ఆమె తల్లి అయనకు బాసటగా నిలబడింది. అందు వల్ల ఆమె ఎప్పుడూ బాధలూ, కష్టాలూ తప్ప ఐశ్వర్య సుఖాలు అనుభవించలేక పోయింది.

1936 వ సంవత్సరం ఇందిర, తల్లి కమలా నెహ్రూను పోగొట్టుకున్నది. అనాటి నుంచి ఆమె, తనే తండ్రిగారికి తల్లిలా, ఆయన 1964 వ సంవత్సరం కాలధర్మం చెందేవరకు, అవ్యాజాను రాగాన్ని పంచింది. భర్త ఫిరోజ్‌గాంధి, పిల్లలు రాజీవ్, సంజయ్ పట్ల తన బాధ్య తలను నిర్వహిస్తూనే, ఆమె తండ్రికి తోడుగా నిలిచింది. ఆమె ఆదరణ, అప్యా యత, సంరక్షణ, సలహా—నెహ్రూ మన దేశం, ఆసియాఖండం, ప్రపంచం అభ్యు న్నతికి మరింత కృషి చేయడానికి ఎంతో సహాయం చేశాయి.

అచంచలమైన ధైర్యం, మాతృదేశాభి మానం ఇందిరకు పుట్టుకతో వచ్చాయి. తండ్రిగారి సాహచర్యం ఆమెకు మరింత









అనుభవాన్ని, వివేకాన్ని ప్రసాదించింది. తన భర్తా, చిన్న కుమారుడూ మరణించిన విషాద ఘడియలలో ఆమె ప్రదర్శించిన ఆత్మస్థైర్యం నిరుపమానమైనది. మరికొన్ని రాజకీయ, జాతీయ సమస్యలు ఎదురైనప్పుడు కూడా ఆమె అటువంటి ఓర్పునే చూపారు!

అక్టోబర్ 31వ తేదీన ఇందిరాగాంధి తన దేశం కోసం ప్రాణాలర్పించారు. ఆమె అందరినీ ప్రేమించారు. బాలలంటే ఆమెకు మరీ ఇష్టం. 'చందమామ'ను కూడా ఆమె ఎంతో విలువైనదిగా భావించారు. "ప్రకృతి అందచందాలను, అద్భుతమైన ఆలోచనా ప్రపంచాన్ని హృదయాలకు పరిచయం చేసే పుస్తకాలూ, పత్రికలూ మన బాలలకు ఎంతో అవసరం. బాలలకోసం తీసుకొచ్చే ప్రచురణలు బాలలలో ఊహాశక్తిని, సౌందర్య దృష్టిని, ధైర్యసాహసాలను పెంపొందించాలి. దానితో పాటు, అవి తమ చుట్టూ వున్న సమాజంతోనూ, ప్రపంచంతోనూ, సఖ్యంతో, సత్సంబంధంతో జీవించే విధంగా వారికి బోధించాలి. 'చందమామ' నిరంతర విజయానికి నా శుభాకాంక్షలు అందజేస్తున్నాను" అని ఆమె తెలియజేశారు.





'చందమామ' సంస్కృతంలోనూ వెలువడనున్నదని తెలిసినప్పుడు ఆమె ఇలా రాశారు:

"భారతీయ సంస్కృతికి సంస్కృతం మూలాధారం. మన పలు ప్రాంతీయ భాషలకు సంస్కృతం తల్లి లాంటిది. ఆ భాషా సంపద యువతీయువకులకు పరిచయం కావాలి. సంస్కృతం 'చందమామ'కు నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను."

ఆమె ప్రేమ, వివేకం మనకు శాశ్వతమైన ప్రేరణగా భాసిస్తుంది. సగర్వంగానూ, కృతజ్ఞతా భావంతోనూ ఆమెను మనం ఎల్లప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటాం.

Photographs: Courtesy 'Hindustan Times'



"అబ్బాయిది పదకొండేళ్ళ ప్రాయం. నేడిక. ఫుట్‌బాల్ ఆటలో ప్రపంచంలో సాటిలేని మేటి ఫార్వర్డ్ ఆడగాడవుతాడట."

# బోర్న్‌విటాతో పెరిగే ప్రాయం యిది యిక

## వాళ్ళు మిమ్మల్ని మెచ్చుకునే రోజొకటి వస్తుందిక!

పెరిగే వయస్సులోని పిల్లలు మరే మాల్టెడ్ ఆహార పానీయమూ కాకుండా బోర్న్‌విటాయే ఎందుకు కావాలంటారు? రెండు తరాల్లోని తల్లిదండ్రులు వాళ్ళ పిల్లలకి యిక మరేదీ కుదరదని ఎందుకు పట్టుబడతారు?

కేవలం ఘుమ్ అనిపించే రుచి మాత్రమే కాదు. మరి కేవలం బోర్న్‌విటా పేరు చూసీ కాదు. ఉంది అందులో మరేదో. ఉంది యింకా మరెంతో. అదే మరి బోర్న్‌విటా, పెరిగేందుకు తోడ్పడే ఆహార పానీయం.

**క్యాడ్‌బరీస్**
**బోర్న్‌విటా**

పిల్లలు సరిగ్గా పెరగడం,
అందుకే మరి బోర్న్‌విటా యివ్వటం.

1 కి.గ్రా. ప్యాక్‌లో కూడా దొరుకుతుంది. దీని లోపల ఉంది ఉచితంగా లభించే మగ్.




OBM/3784 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చ క్ర పా ణి'
సంచాలకుడు : నా గి రె డ్డి

రెండు సంవత్సరాలపాటు సీరియల్‌గా సాగిన, ''విష్ణు కథ'' ఈ సంచికలో పూర్తి అవుతున్నది. ఇది వడ్డాది పాపయ్య రచన.

జనవరి 1985వ సంచికలో, మరొక పురాణ కథ ప్రారంభమవుతుంది.

ఈ నెల బేతాళకథ ''గజదొంగ''కు ఆధారం, మాచిరాజు కామేశ్వరరావు రచన.

## అమరవాణి

స్వీయం తపో సతీరూపం, పాండిత్యం తనయస్య చ,
మూలికా స్వగృహోత్పన్నా, న స్తుత్యా నీతికోవిదైః.

[తాను చేసే తపస్సునూ, తన భార్య చక్కదనాన్నీ, తన పుత్రుని పాండిత్యాన్నీ, తన పెరటిలోని ఓషధినీ—నీతివేత్తలు నలుగురి ముందూ ప్రశంసించుకొనరు.]

సంపుటి 75 డిసెంబర్ '84 సంచిక 6

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు

## అరుదైన దృశ్యం



మధ్య యుగంనాటి యోధులు ఎటువంటి కవచాలు ధరించే వారు? ఎలా నడిచేవారు? అన్న విషయాన్ని పదిమందికీ తెలియజేసే ఉత్సాహంతో—బ్రిటన్‌కు చెందిన బిక్ బ్రౌన్ - 112 పౌండ్లు బరువైన యోధుడి కవచాలు ధరించి ఎడింబరో నుంచి డమ్‌ఫ్రీస్‌కు మూడు రోజులపాటు ప్రయాణం చేశాడు।

## కనుగొన్న కవి సమాధి



పృథ్వీరాజు - రాణీ సంయుక్త వీరోచిత గాథ అందరికీ తెలిసిందే. పృథ్వీరాజు ఆస్థానంలో చంద్‌బర్దాయ్ అనే కవి వుండే వారు. ఆయన పృథ్వీరాజుకు ఆప్తమిత్రుడు కూడా. ఆ కవిగారి సమాధిని ఇటీవల ఒక పరిశోధకుల బృందం - ఉత్తరప్రదేశ్‌లోని ఫతేపూర్ హాస్వాలో కనుగొన్నది.

## అనువాద యంత్రం!



జపాను భాష నుంచి ఇంగ్లీషుకు తర్జుమా చేసే ఒక అద్భుతమైన యంత్రం జపానులో రూపొందించబడింది. ఈ యంత్రం గంటకు మూడు వేల పదాలను అనువాదం చేస్తుంది.

## మీకు తెలుసా?

1. పసిఫిక్ మహాసముద్రానికి ఆ పేరు పెట్టిన వారెవరో మీకు తెలుసా?
2. హిందూ మహా సముద్రంలో లోతైన ప్రదేశం ఏది?
3. భారతదేశం - శ్రీలంకల సరిహద్దును తెలియజేసే జలసంధి పేరేమిటో మీకు తెలుసా?
4. ప్రపంచంలోకెల్లా పొడవైన నది ఏది?
5. రోమ్ నగరం అనుకుని ప్రవహించే నది ఏది?

(సమాధానాలు 64 వ పేజీలో)



# ఇంటి భద్రత

రాజవరంలో, శివయ్య అనే ఆసామీకి, ఊరి నడివీధిలో పెద్ద మండువాలోగిలి ఒకటి వున్నది. వయసులో వుండగా, బాగా శ్రమించి సంపాదించిన డబ్బుతో, స్వయంగా కట్టించుకున్నందువల్ల, అతడా ఇంటిని ఆరోప్రాణంగా చూసుకునేవాడు.

ఒక రోజు శివయ్య భార్య సుందరమ్మ అతడితో, "ఊళ్లోవాళ్ళు కొందరు జట్టుగా కాశీయాత్రకు ఏర్పాట్లుచేసుకుంటున్నారు. నాలుగు పుణ్యక్షేత్రాలూ తిరిగి, నలుగురు దేవుళ్ళనూ కొలుచుకురావడానికి, యింత కన్న మంచి అవకాశం రాదు. మనం కూడా బయలుదేరుదామా?" అన్నది.

శివయ్య విసుగ్గా, "లంకంత ఇంటిని అలా వదిలేసి, యీ యాత్రలేమిటి? కాశీ వెళ్ళి తిరిగొచ్చేసరికి, కనీసం ఆరు నెలలైనా పడుతుంది. ఈలోగా, ఇంటి భద్రత ఎవరు చూసేట్టు!" అన్నాడు.

భర్త యిలా అనగానే సుందరమ్మ కోపంగా, "నీ ప్రాణానికీ, ఈ ఇంటికీ ఏదో లంకెవున్నట్టు కనబడుతున్నది. దూరంగా ఉద్యోగాలు చేసుకుంటూ, అక్కడే స్థిరపడిపోయిన, నీ కొడుకులకు ఈ ఇంటి అవసరం ఎలానూ లేదు. దీన్ని అమ్మిపారేసి, మనిద్దరినీ తమ దగ్గిరకు వచ్చి వుండమని, వాళ్ళు ఎన్నాళ్ళుగానో చెపుతున్నా, నీ తలకెక్కడం లేదు. ఇప్పుడా పని నువ్వు చేస్తే, మనకు ఇల్లు ఏమయిపోతుందో అన్న బెంగా వుండదు; యాత్రలకని డబ్బు కోసం ఎవరినీ దేవిరించ పనీ వుండదు. ఆ తరవాత మనం ఇద్దరమూ కొడుకుల దగ్గిరకే పోయి హాయిగా వుందాం," అన్నది.

"నేను బతికుండగా, యీ ఇంటిని అమ్మే ప్రసక్తేలేదు," అంటూ శివయ్య భార్యను గట్టిగా మందలించాడు.

జొన్నలగడ్డ రత్న



అయినా సుందరమ్మ ఊరుకోక మొండిగా, "ఎప్పుడు ఎక్కడికి తీసుకు వెళ్ళమన్నా, ఇల్లో, ఇల్లో అంటూ వాయిదా వేస్తున్నావు. కాలూ, చెయ్యీ గట్టిగా వున్నప్పుడే, ఇలాంటి యాత్రలు పూర్తి చేసుకోవాలన్న సంగతి, నీ కర్థం కావడం లేదు. కావాలంటే, మనం తిరిగొచ్చేదాకా, ఇంటిని భద్రంగా చూడడానికి నా తమ్ముడు లేడా, నీ మేనల్లుడు కాదంటాడా?" అన్నది.

ఈసారి శివయ్య భార్యకేసి కళ్ళెర్ర చేస్తూ, "ఇల్లంటూ కదిలితే, తాళం వేసయినా పోతానుగాని, బంధువులను మాత్రం లోన అడుగుపెట్టనివ్వను," అని, ఏదో ఆలోచన వచ్చినవాడిలా చప్పున లేచి, "నువ్వు కోరినప్రకారమే, యాత్రలకు వెళ్ళడం జరుగుతుందిలే!" అంటూ వీధిలోకి నడిచాడు.

భర్త యిలా అనగానే సుందరమ్మకు కలిగిన ఆనందం అంతా యింతా కాదు.

శివయ్య తిన్నగా షావుకారు వరదయ్య ఇంటికి వెళ్ళి, తను కాశీయాత్రకు వెళుతున్నట్టు చెప్పి, ఇంటిని తాకట్టు పెట్టుకుని రెండువేలు యివ్వమన్నాడు.

వరదయ్య లోపల సంతోషపడి పోతూ, పైకి మాత్రం ముఖం చిట్లించి, "ఇలా తాకట్లూ వాకట్లూ ఎందుకు? వడ్డీ దండగ. ఇల్లు అమ్మేస్తే పోలా, నువ్వు సరే అంటే, పెద్ద మనుషులు నలుగురికీ కబురు చేసి, ఇంటికి న్యాయమైన ధరకట్టిస్తాను," అన్నాడు.

శివయ్య చిరాకుగా, "నాక్కావలసింది, ఇంటి మీద అప్పు, వీలుకాదంటే మరోచోటుకు పోతాను," అన్నాడు.

"సరే, నీ యిష్టం! కాని, ఒక సంగతి మాత్రం గుర్తుంచుకో, కాశీయాత్రలాంటి పెద్ద ప్రయత్నం తల పెట్టినప్పుడు, అత్తెసరుగా వెయ్యీ, రెండువేలూ సరిపోవు. రూపాయి వడ్డీ మాత్రమే పుచ్చుకుంటాను. అంత పెద్ద ఇంటి మీద ఐదు వేలిమ్మన్నా యిస్తాను," అన్నాడు వరదయ్య.

శివయ్య అలాగే కానిమ్మని, అతని దగ్గర డబ్బు తీసుకుని పత్రం మీద చేవ్రాలు చేశాడు.

అక్కడి నుంచి శివయ్య తన మేనల్లుడు రంగారాయుడి ఇంటికి వెళ్ళి, మేనల్లుణ్ణి, "ఏరా, రాయుడూ! ఆ మధ్య, నీ చేలో కలిసే పక్కభూమి అమ్మకానికున్నదనీ, అది కొనేందుకు షావుకారు వరదయ్య దగ్గిర అప్పు చేయబోతున్నాననీ చెప్పావు. పని సానుకూలమయిందా?" అని అడిగాడు.

రంగారాయుడు దిగులుగా ముఖం పెట్టి, "ఆ పిసినారి వరదయ్య ఒక పట్టాన డబ్బు యిస్తాడా! రెండు రూపాయిల వడ్డీ కావాలంటున్నాడు. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు.

"అలాగా! అయితే, ఈ ఐదువేలూ తీసుకో! నేనూ, మీ అత్తయ్యా కాశీ యాత్ర వెళ్తున్నాం. నే తిరిగి రాగానే, ఒక రూపాయి వడ్డీతో, యీ ఐదు వేలూ నాకు తిరిగి యివ్వాలి," అని శివయ్య, మేనల్లుడికి డబ్బిచ్చాడు.

అతడు ఇంటికి వస్తూనే, భార్యకు కాశీ యాత్రకు అన్నీ సిద్ధం చేసుకోమని చెప్పాడు. ఆమె భర్త ముఖం కేసి అనుమానంగా చూస్తూ, "యాత్రకు అవసరం అయిన డబ్బు ఎక్కడి నుంచి తెచ్చావు?



ఇంటిని ఎవరికి అప్పు చెబుతున్నావు?" అని అడిగింది.

"ప్రతి విషయం నీకు చెప్పాలా? నేనేం చేసినా, బాగా ఆలోచించే చేస్తాలే," అంటూ శివయ్య విసుక్కున్నాడు.

ఆ తరవాత వారం రోజులకు ఆ దంపతు లిద్దరూ, మిగతా యాత్రికులతో కలిసి కాశీకి ప్రయాణమయ్యారు.

ఆరో నెల జరుగుతూండగా శివయ్యా, సుందరమ్మా యాత్ర నుంచి తిరిగి వచ్చారు. సుందరమ్మ భర్తకు ఇల్లంతా తిరిగి చూపిస్తూ, "ఆరు నెలల నుంచి, యిది మనుషులు మసలని ఇల్లంటే ఎవరైనా నమ్ముతారా? ఇల్లంతా అద్దం

లాగావున్నది. ఎక్కడా రవ్వంత దుమ్ము గాని, బూజుగాని లేదు. నీళ్ళు పోసేవాళ్ళు లేక దొడ్లోని చెట్లూ, పాదులూ ఎండి పోయి వుంటాయనుకున్నాను. కాని అవి మునుపటికన్న ఎక్కువగా నవనవలాడి పోతున్నాయి,'' అన్నది ఆశ్చర్యంగా.

శివయ్య చిరునవ్వు నవ్వి, ''ఇదంతా, ఆ షావుకారు వరదయ్యచలవ!'' అన్నాడు.

సుందరమ్మ నివ్వెరపోయి, ''ఇంటిని ఇంత భద్రంగా కాపాడవలసిన అవసరం, షావుకారు కెందుకక్కలిగింది?'' అన్నది.

''అందుకు పెద్ద కారణమే వున్నది. మనం ముసలి వాళ్ళమై పోయాం కనక, ఏదో ఒకనాడు కొడుకుల దగ్గిరకు వెళ్ళి పోతామనీ, అప్పుడు కొంచెం ఎక్కువ ధరైనా పెట్టి, ఈ ఇంటిని తాను కొనుక్కోగలనన్న ఆశ, షావుకారుకున్నది. అందుకే, నేను రెండువేలు అడిగితే, కాదని ఇల్లు తాకట్టు పెట్టించుకుని, ఐదు వేలిచ్చాడు. బహుశా మనం కాశీనుంచి తిరిగి రామనో లేక వచ్చినా, అంత పెద్ద బాకీ తీర్చలేమనో అతడు ఆలోచించి వుండాలి. ఇదంతా పసికట్టే, నేను వరదయ్యకన్న ఇంటిని భద్రంగా చూడగల వాడు మరొకడు లేడన్న నిర్ణయానికి వచ్చి, తాళం చెవులు అతడికిచ్చాను,'' అన్నాడు శివయ్య తృప్తిగా.

''వరదయ్య కుటిలబుద్ధి మాటసరే! మరి, అంత పెద్ద బాకీ నువ్విప్పుడు తీర్చగలవా?'' అన్నది సుందరమ్మ.

''అతణ్ణించి తెచ్చిన డబ్బులో యాత్ర ఖర్చులకు మనం దమ్మిడీ వాడుకోలేదు. మన కష్టార్జితంలోంచి దాచుకున్న సొమ్మే, ఈ యాత్రకు కొంత ఖర్చు పెట్టాం. ఆ ఐదువేలూ డబ్బు అవసరంలో వున్న, నా మేనల్లుడికిచ్చాను. రేపు వెళ్ళి, వాణ్ణించి ఆ డబ్బు తీసుకుని షావుకారుకిచ్చి, ఇంటి తాకట్టు విడిపిస్తాను,'' అన్నాడు శివయ్య గర్వంగా.

కేవలం ఇంటి భద్రతకోసం, ఇంత పెద్ద నాటకం ఆడిన భర్త తెలివి తేటలు చూసి సుందరమ్మ అబ్బురపడింది.






## 2

[మాహిష్మతీనగర రాజైన యశోవర్ధనుడు, తన కుమారు లిద్దరిలో చిన్నవాడైన గుణవర్ధనుడికి పట్టాభిషేకం చేయాలని నిశ్చయించాడు. కాని యిందుకు వీరపుర సామంతుడైన సూర్యవర్మ వ్యతిరేకించాడు. సర్పకేతు డనే సామంతుడు, గుణవర్ధనుడితో కుట్రపన్ని, అతణ్ణి హత్య చేసేందుకు అడవిలో పొంచివుండి హఠాత్తుగా మీద పడ్డాడు. తరవాత—]

సూర్యవర్మ తను శత్రువ్యూహంలో చిక్కుకున్నానని గ్రహించాడు. ఆ శత్రువు ఎవడో కూడా అతడికి అర్థమైంది. ''నరకండి! చంపండి! సూర్యవర్మ ప్రాణాలతో బైట పడితే, మీ ప్రాణాలు దక్కవు!'' అన్న మాటలు అతడికి వినిపించినై. ఆ కంఠస్వరం సర్పకేతుడి దని అతడు వెంటనే పోల్చుకున్నాడు. సూర్యవర్మ చేతికత్తి గాలిలో రివ్వు రివ్వుమని భయంకరంగా ధ్వనించింది. ఎదురుగా వున్న శత్రు సైనికుడి తలతోపాటు, పక్కగా ఎదురొక్కన వచ్చిన శత్రువు కుడి చేయి కూడా ఒకే దెబ్బకు గాలిలోకి ఎగిరి దూరంగా పడినై. కాని, అదే సమయంలో మరి నలుగురు శత్రు సైనికులు ఒక్కుమ్మడిగా అతణ్ణి చుట్టుముట్టారు. సర్ప కేతుడు భీకరంగా అరుస్తూ తన సైనికులను హెచ్చరిస్తున్నాడు.



అంతలో దూరం నుంచి, "అయ్యా, ప్రభూ! వస్తున్నాను," అన్న జవాబు వినబడింది.

"నువ్వు వెంటనే వీరపురానికి వెళ్ళి, చంద్రవర్మతో...." సూర్యవర్మ మాట ముగించక ముందే, ఒక శత్రుసైనికుడు అతణ్ణి వెనకనుంచి కత్తితో పొడిచాడు.

ఆ కత్తిపోటుకు, సూర్యవర్మ, "అబ్బా!" అంటూ గుర్రం మీది నుంచి కిందికి పడిపోయాడు. అదే సమయంలో అతడి శరీరం మీద మరి కొన్ని కత్తిదెబ్బలు బలంగా తగిలినై.

"అదుగో, ఒకడు పారిపోతున్నాడు! వాణ్ణి తరిమి చంపండి. ఈ వార్త ముందుగా వీరపురంలో తెలియకూడదు!" అంటూ సర్పకేతుడు గావుకేక పెట్టాడు. ఆ వెంటనే నలుగురైదుగురు అశ్వికులు, పారిపోతున్న సుబాహుడి వెంటబడ్డారు.

తనకు మృత్యువు తప్పదని సూర్యవర్మ అనుకున్నాడు. హఠాత్తుగా అతడికి తన కుమారుడు చంద్రవర్మ గుర్తుకు వచ్చాడు. తన మరణం తరవాత సర్పకేతుడు తన సంస్థానాన్ని ఆక్రమించుకునేందుకు ప్రయత్నించి తీరుతాడు. ముందుగా తన కుమారుణ్ణి తగు జాగ్రత్తలో వుండ వలసిందిగా హెచ్చరించగలిగితే ఎంత బావుండును!

"సుబాహూ! సుబాహూ!" అని పెద్దగా కేకవేస్తూ, సూర్యవర్మ శత్రు అశ్వికుల్లో ఒకణ్ణి కత్తితో నిలువునా నరికి, మరొకడి గుర్రాన్ని గుండెల్లో పొడిచి అది అదనుగా తనగుర్రాన్ని వెనక్కు తిప్పాడు.

సుబాహుడు సూర్యవర్మ సేవకుల్లో చాలా నమ్మకస్థుడు. అతడు బాల్యం నుంచి సూర్యవర్మను సేవిస్తున్నవాడు. అతడు మంచి తెలివితేటలు గలవాడే కాక, చాలా ధైర్యసాహసాలు కూడా గలవాడు.

తన ప్రభువును రక్షించటం సాధ్యం కాదని గ్రహించగానే, సుబాహుడు అక్కడి నుంచి పారిపోయి, జరిగిన ఘోరం సంగతి ముందుగా చంద్రవర్మతో చెప్పా

లమకున్నాడు. అంతలో సూర్యవర్మ హెచ్చరిక వినిపించింది. సుబాహుడు తన గుర్రాన్ని శత్రుఅశ్వికుల మధ్య నుంచి పక్కకు దూకించి, కొండదారి వెంట నడిపాడు.

గుర్రం అతి వేగంగా పరిగెత్తుతున్నది. సుబాహుడు వీరపురం చేరాలంటే, ఆ కొండపై నున్న చుట్టుదారి వెంట పోవాలి. ఆ మార్గం చాలా ఇరుకైనది. రెండు గుర్రాలు ఎదురుబొదురుగా తప్పుకునేం దుకు మాత్రమే జాగా ఉంటుంది.

గుర్రాన్ని కొండమీదికి ఎక్కుస్తూ, సుబాహుడు వెనుదిరిగి చూశాడు. అతడిని వెంబడిస్తున్న అశ్వికులు కూడా తమ గుర్రాలను ఒకదాని వెనక ఒకదానిని కొండ ఎక్కుస్తున్నారు.

శత్రు సైనికులకూ, సుబాహుడికీ మధ్య వున్న దూరం దాదాపు బాణం వేటుకు అందీ అందనట్లుగా వుంటుంది.

తనకూ, శత్రువులకూ మధ్య వున్న దూరాన్ని మరికొంత ఎక్కువ చేసుకో గలిగితే తప్ప, లేకపోతే శత్రువుల బాణా లకు తను ఆహుతి కావలసి వస్తుందని సుబాహుడు గ్రహించాడు.

అతడిలా ఊహిస్తున్నంతలో రివ్వు మంటూ ఒక బాణం వచ్చి, అతడికి పది పన్నెండు గజాల వెనకగా తక్కు



మంటూ ఒక కొండరాయికి బలంగా తగిలి, రెండుగా విరిగి కింద పడిపోయింది.

సుబాహుడు తన గుర్రాన్ని గట్టిగా అద లించాడు. అది మరింత వేగంగా పోసాగింది. వెనక రివ్వుమనే బాణాల చప్పుడూ, కేకలూ వినిపించసాగినై. కొంచెంసేపు తరవాత అతడు వెనుదిరిగి చూశాడు. శత్రుసైనికులకూ అతడికీ మధ్య వున్న దూరం మరికొంత ఎక్కువ యింది. కాని, వాళ్ళు వదిలేలా లేరు. అతణ్ణి అనుసరించి గుర్రాలను నడుపు తూనే వున్నారు.

మెలికలుగా కొండను చుట్టివున్న, ఆ సన్నని మార్గం వెంట సుబాహుడు తన

గుర్రాన్ని జాగ్రత్తగా నడుపుతున్నాడు. అతడికి కుడివైపున ఉవ్వెత్తుగా లేచిన కొండగోడా, ఎడమవైపున అగాధంలాంటి పల్లమూ వున్నవి. గుర్రం కాలు ఏ మాత్రం పట్టు తప్పినా, తను అగాధంలోపడి తునాతునకలవటం తప్పదు. అంతేకాక, క్రమంగా చీకటి కమ్ముకోవటంతో మార్గం కూడా అంత స్పష్టంగా కనిపించటం లేదు. కాని, తనను శత్రువులు వెంబడి స్తున్నారన్న సూచనగా, గుర్రాల సకిలింపులూ, వాటి గిట్టలకు తగిలి దిగువ అగాధంలోకి జారుతున్న రాళ్ళధ్వనీ వినిపించుతూనే వున్నవి.

కొంతసేపటికి బాగా చీకటిపడి చంద్రుడు ఉదయించాడు. కొండమార్గం మరింత మెలికలు తిరుగుతున్నది. అలాంటి సమయంలో సుబాహుడికి హఠాత్తుగా శత్రుఅశ్వికులు అగాధానికి అవతల వున్న దారి మీద కనిపించారు. అంతకు ముందు అతడు ఆ మార్గానే వచ్చాడు. మధ్య అగాధం ఒకటి వారిని వేరుచేస్తున్నా, అడ్డదారిన చూస్తే, వాళ్ళు అతడికి చాలా సమీపంలో వున్నారు. "ఇప్పుడు వాళ్ళు బాణాలు ప్రయోగించేందుకు మంచి అవకాశం!" అనుకుంటూ సుబాహుడు గుర్రం మీది నుంచి దిగబోయేంతలో రివ్వుమంటూ ఒక బాణం వచ్చి గుర్రం డొక్కలో బలంగా తాకింది.

గుర్రం ముందు రెండు కాళ్ళనూ గాలిలోకి ఎత్తి, పెద్దగా ఘోషించి గుడ్డి



దానిలా కుడివైపునవున్న కొండ అంచును తలతో ఓసారి ఢీకొట్టి, దభీమంటూ పక్కకు పడిపోయింది. దానితోపాటు సుబాహుడు కూడా కిందికి పడిపోయాడు. మరుక్షణం గుర్రం పెద్దగా సకిలించి అగాథం వైపుకు దొర్లింది. రికాబులో కాలు చిక్కుకున్న సుబాహుడు కూడా దానితోపాటు అగాథంకేసి ఈడ్వబడ్డాడు. అయిదారు పొర్లిగింతల తరవాత కొంచెం ఏటవాలుగా వున్న ఆ ప్రదేశంలో సుబాహుడి చేతికి ఒక బలమైన చెట్టుకొమ్మ దొరికింది.

అతడు దానిని బలంగా రెండు చేతులతోనూ పట్టుకున్నాడు. అతడి కాలినుంచి రికాబు జారిపోయింది.

గుర్రం పెద్ద ధ్వనితో రాళ్ళమీదుగా మరికొంత దూరం దొర్లుకుంటూ పోయి, పెద్ద శబ్దంతో 'దిగువనున్న అగాథంలో పడిపోయింది.

అగాథానికి అవతల గల కొండమార్గం మీదినుంచి ఒక్కుమ్మడిగా కేకలూ, చప్పట్లూ వినిపించినై. శత్రువులు తనను హతమార్చామని భ్రమపడుతున్నారని సుబాహుడు గ్రహించాడు. గుర్రంతోపాటు తనూ అగాథంలో పడి ఛిన్నాభిన్నమై పోయాడని వాళ్ళు భావిస్తున్నారు.

సుబాహుడు చెట్లకొమ్మల్లో వున్న చోటునే కదలా మెదలక వుండిపోయాడు. ఆ ప్రదేశం కొంత చీకటిగా వున్నా, తెల్లని చంద్రకాంతిలో తను కదిలితే శత్రువులు





గుర్తించవచ్చు. అప్పుడు మరొక బాణం తన ప్రాణాలను బలిగొంటుంది.

సుబాహుడు కొమ్మల సందుగా శత్రు సైనికుల కేసి పరీక్షగా చూశాడు. వాళ్ళు గుర్రాలు దిగి అగాధం అంచుకు వచ్చి మోకాళ్ళమీద వంగి చూసి, తరవాత తమతమ గుర్రాల దగ్గిరకు వెళ్ళి కొంచెం సేపు కూడబలుక్కున్నారు. వాళ్ళు ఒక వేళ తనను గుర్తించారేమో అని భయ పడుతూన్న సుబాహుడికి, అంతలోనే వాళ్ళ నవ్వులు వినిపించినై. తరవాత వాళ్ళు గుర్రాలను వచ్చిన మార్గంకేసి తిప్పి, వాటిని అధిరోహించి బయలు దేరారు.

సుబాహుడు నిశ్చింతగా వూపిరి పీల్చు కున్నాడు. రికాబులో చిక్కి మెలిదిరిగిన కాలు నొప్పి పెడుతున్నా, అతడికి ఆ సమయంలో అదేమంత బాధ అనిపించ లేదు. తను శత్రువుల చేతబడకుండా తప్పించుకున్నాడు. సూర్యోదయం లోపల వీరపురం చేరి చంద్రవర్మకు, జరిగిన ఘోరం సంగతి చెప్పి, సర్పకేతుడి మీద పగ తీర్చుకునే ఉపాయం గురించి ఆలో చించవచ్చు.

శత్రుసైనికులు కొండమార్గం మలుపు తిరగగానే, సుబాహుడు కొమ్మల చాటు నుంచి బయటికి వచ్చాడు. అతడి దుస్తులు చీలికలూ వాలికలూ అయి వున్నవి. శరీరం చాలాచోట్ల దోక్కుపోయి రక్తం కారుతున్నది. అతడు అక్కడ వున్న చెట్ల ఆకులు రెండు గుప్పెళ్ళ నిండా కోసి, వాటిని బాగా నలిపి ఆ వచ్చిన ఆకురసాన్ని తన గాయాలకు పూసు కున్నాడు. అదే సమయంలో అతడికి కొంత దాపులగా కొండచిరుత అరుపు వినిపించింది.

ఆ అరుపు వింటూనే సుబాహుడు నిశ్చేష్టుడయ్యాడు. ఈ కొండకోనల్లో చిరుతపులులూ, తోడేళ్ళేగాక, పెద్ద పెద్ద కొండచిలువలు కూడా వుంటవని అతడికి జ్ఞాపకం వచ్చింది. అలాంటి వాటి నోట

పడకుండా తను బతికి బయటపడాలంటే రక్షణకు ఏదో ఒక ఆయుధం అవసరం. కాని, తన కత్తీ డాలూ గుర్రంమీద నుంచి దొర్లినప్పుడు ఎక్కడో పడిపోయినై.

సుబాహుడు అటు యిటూ కలయ చూసి, అందుబాటులో కనిపించిన ఒక దృఢమైన చెట్టుకొమ్మను విరిచి చేత బట్టుకున్నాడు. తరవాత అక్కడ వున్న రాళ్ళనూ, కొమ్మలనూ ఊతగా చేసుకుని కొంచెం, కొంచెంగా పాకుతూ, మార్గం మీదికి వచ్చాడు.



ఇప్పుడు తను ఏ మార్గాన పోతే వీర పురం దగ్గిరో సుబాహుడికి తెలును. అతడు గుడ్డి వెలుగులో అతిజాగ్రత్తగా నడుస్తూ, బాగా నడిరేయి అయేసరికి కొండకు అద్దరిన వున్న ఒకానొక గ్రామప్రాంతానికి చేరాడు.

గ్రామం యింకా అల్లంత దూరం వుండనగా సుబాహుడికి కాగడాల కాంతీ, వాటి చుట్టూచేరి మాట్లాడుకుంటున్న మనుషులూ కనిపించారు. ఇంత రాత్రి వేళ గ్రామవాసులకు వూరి వెలపల ఏం పని? బహుశా, యీ కాగడాలు బంది పోటు దొంగలవేమో అన్న అనుమానం కలిగింది సుబాహుడికి. అంతలోనే గుర్రపు డెక్కల శబ్దం వినబడింది. రస్తా వెంట అతివేగంగా పరుగులు తీస్తున్న రౌతులు కొందరు, కాగడాలు పట్టుకుని వున్న వాళ్ళను సమీపించి, "ఇంకా యిక్కడే జాగుచేస్తున్నారా? ఊఁ—కదలండి, నడవండి!" అని హెచ్చరిక లిస్తూ ముందుకు వెళ్ళిపోయారు.

ఈ సంఘటన సుబాహుడికి ఆశ్చర్యాన్నే కాక, అనుమానం కూడా కలిగించింది. ఆ కాగడావాళ్ళు బందిపోట్లు కారు. గుర్రపు రౌతులు ధరించిన దుస్తుల తీరుచూస్తే, వాళ్ళు సైనికులుగా కనిపిస్తున్నారు. అయితే వాళ్ళు వీరపుర సైనికులా? లేక సర్పకేతుడి సైనికులా? కాగడాలచుట్టూ చేరిన జనం కదిలి వెళ్ళవలసిన ప్రాంతం ఏదై వుంటుంది?

ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలంటే, తను ఆ కాగడాలున్న చోటుకు వెళ్ళటం ఒక్కటే మార్గమని సుబాహుడు నిశ్చయించుకున్నాడు. ఒక వేళ వాళ్ళు వీరపురం పౌరులే అయితే, వాళ్ళనుంచి తను ఒక గుర్రాన్ని ఎరువు తీసుకుని త్వరత్వరగా వీరపురం చేరవచ్చు. అలా కాకవాళ్ళు శత్రువులైతే....సుబాహుడు తన దుస్తులకేసి పరీక్షగా చూసుకున్నాడు. ఈ చింకి దుస్తుల్లో తను ఫలానా అని ఎవరూ గుర్తించలేరన్న ధైర్యం అతడికి కలిగింది. అతడు ముందుకు నడిచి కాగడాలవాళ్ళను సమీపించాడు.

సుబాహుడు దాపులకు వచ్చేలోపలే, కాగడాల చుట్టూ చేరినవాళ్ళలో ఒకడు, పెద్దగా గొంతెత్తి, "అడుగో, ఎవడో బిచ్చగాడు వస్తున్నట్టున్నది. ఒరే తిరిపెం! నువు యిక అడుక్కుతిన నవసరం లేదు. తెల్లవారేలోపల మేము వీరపురాన్ని కొల్లగొట్ట బోతున్నాం. మా వెంట వస్తివా, నీకూ్కడా అటూ యిటూ పధ్నాలుగు తరాలకు సరిపడా సొమ్ము దొరుకుతుంది! ఏమంటావ్? వస్తావా?" అన్నాడు.

సుబాహుడు నిర్విణ్ణుడై అంతలోనే తేరుకుని, "అవును, దొరా! నేనూ మీ వెంట వీరపురం వస్తాను. నాకు సొమ్మేమీ అవసరం లేదు. బొక్కటానికి యింత బువ్వ దొరికితే చాలు!" అన్నాడు.

అవతలివాడు ఏదో అనబోయేంతలో కొందరు రౌతులు వేగంగా అటు వస్తూ, "సర్పకేతరాజుకూ జై!" అంటూ అరిచి, "మీలో ఎవరైనా వీరపురం వాళ్ళున్నారేమో ఇప్పుడే చూసుకోండి. తరవాత ఏడిచి లాభం లేదు!" అన్నారు.

జనంలో ఒకడు, సుబాహుణ్ణి వాళ్ళకు చూపుతూ, "ఇక్కడ వున్నవాళ్ళమంతా ఒకరి నొకరు ఎరిగున్న వాళ్ళమే! వీడెవడో కొత్తవాడు. బిచ్చగాడిలా వున్నాడు. యిప్పుడే యిక్కడికి వచ్చాడు," అన్నాడు.

రౌతులు "హేయ్!" అంటూ సుబాహుడి కేసి తమ గుర్రాలను వేగంగా దూకించారు. —(ఇంకావుంది)






# గజదొంగ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మనిషి తన బతుకుతెరువుకూ, ఉన్నతికీ నిరంతరం శ్రమిస్తాడు. ఇంత అర్ధరాత్రి వేళ నువ్వు పడుతున్న శ్రమ, అలాంటిదే అనుకోవడం నిజంకాదన్న అనుమానం కలుగుతున్నది. దేశపాలకులైన కొందరు రాజులు వక్రబుద్ధులు. తమకే క్షణాన ఏది తోస్తే, అదే ఉత్తమ పద్ధతి అనుకుంటారు. కాని, అది ప్రజలను యిక్కట్ల పాలు చెయ్యవచ్చు. నువ్వూ, అలాంటి వాళ్ళలో ఒకడివై వుండాలి. ఇందుకు ఉదాహరణగా ఉగ్రశీలు డనే గజదొంగ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్ప సాగాడు:

## బేతాళ కథలు



మణికర్ణిక దేశానికి సత్యేంద్రుడు రాజు. ఆ దేశంలోగల అరణ్యాలలోని కొండల్లో ఉగ్రశీలు డనే గజదొంగ వుండే వాడు. వాడు తన అనుచరులతో, అక్కడి గుహల్లో రహస్యజీవితం గడుపుతూండే వాడు. వాళ్ళు దారిదోపిడీలతో పాటు, దూరంగావున్న గ్రామాలకు దండుగా పోయి, అక్కడి యిళ్ళను కొల్లగొట్టి, తిరిగి తమ రహస్య స్థావరాలు చేరేవారు. వాళ్ళందరూ దొంగతనాలకు పోయి నప్పుడు ముసుగులు ధరించేవారు. అందు వల్ల, ఉగ్రశీలుడు దొంగల నాయకుడని తప్ప, అతడి రూపాన్ని ఎవరూ చూసి వుండలేదు.

ఉగ్రశీలుడి భార్యకు, తన భర్త చేసే దారి దోపిడీలూ, దొంగతనాలంటే చెప్ప రానంత ఏహ్యభావం. ఆమె ఎన్నోసార్లు అతడికి, దొంగగా యీ రహస్యజీవితం నుంచి బయటపడి, అందరిలా స్వేచ్ఛగా బతుకుదాం అని చెప్పి చూసింది. కాని, ఉగ్రశీలుడు ఆ మాటలకు నవ్వి, ఇక యీ జీవితంలో దొంగగా కాక, మరొకలా బతకడం సాధ్యంకాదు, అంటూండేవాడు.

ఉగ్రశీలుడికి పెళ్ళయిన పాతిక సంవత్సరాల తరవాత, ఒక కొడుకు పుట్టాడు. ఇది జరిగాక, అతడి మనసులో ఏనాడూలేని మార్దవం, వాత్సల్యం చోటు చేసుకున్నవి. అతడికి కొడుకంటే పంచ ప్రాణాలు. ఒక్కొక్కసారి అతడు అను చరులతో దూరగ్రామాలకుదోపిడీ నిమిత్తం వెళ్ళినప్పుడు, తిరిగి రావడానికి నాలు గైదు రోజులు పట్టేది. ఈ కాలంలో ఉగ్రశీలుడు అన్యమనస్కంగా వుండే వాడు. అతడిలో పూర్వపు ఆవేశం, క్రౌర్యం కనబడేవి కాదు. దోచుకున్న వాళ్ళ ఇళ్ళల్లో చిన్న పిల్లలుంటే, వాళ్ళను ఎత్తుకుని ముద్దాడేవాడు. ఈ ధోరణి అతడి అనుచరులకు నచ్చేదికాదు.

''ఇలా ముద్దులూ, మురిపాలలో పడితే, మనం ఏదో ఒకనాడు రాజభటు లకు తేలిగ్గా దొరికిపోతాం. నీకేనా కొడుకు

న్నది, మాకు మాత్రం లేరా? దొంగలకు యిలాంటి నైజం ప్రమాదకరం,'' అనే వాళ్ళు అనుచరులు.

ఉగ్రశీలుడు మాత్రం ప్రయత్నించీ తన అలవాటును మానుకోలేక పోయాడు. ఒకసారి వాళ్ళు ఎన్నడూ దోచని ఒక దూరప్రాంత గ్రామానికి బయలుదేరారు. అక్కడికి గుర్రాల మీద ప్రయాణం నాలుగు రోజులు పడుతుంది. వాళ్ళు రాత్రివేళ ప్రయాణం చేస్తూ, పగలు గుబురు చెట్ల చాటున విశ్రాంతి తీసుకునేవాళ్ళు.

ఒకనాటి మిట్టమధ్యాహ్నంవేళ మర్రిచెట్టు నీడలో పడుకుని వున్న ఉగ్రశీలుడికి ఒక కల వచ్చింది. ఆ కలలో అతణ్ణి రాజభటులు వెంటపడి తరుముతున్నారు. అతడెక్కిన గుర్రం, ఒక చెట్టుమోడు కాలికితగలడంతో పక్కకు పడిపోయింది. ఉగ్రశీలుడు గుర్రంతోపాటు కింద పడి లేచి, కాలిసత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు. కాని, అతణ్ణి గుర్రం మీద తరుముకు వస్తున్న భటుడు గురిచూసి బల్లెం విసిరాడు. బల్లెం ఉగ్రశీలుడి వెన్నులో బలంగా దిగింది. అతడు బాధతో బోర్లా పడబోతున్న క్షణంలోనే, అతడి భార్యా, మూడు నెలలకొడుకూ ఒక కొండశిఖరం మీది నుంచి, కింది లోయలోకి పడిపోవడం అతడికి కనిపించింది.

ఉగ్రశీలుడు ఒక వెర్రికేక పెట్టి లేచి కూర్చున్నాడు. అతడు నిలువెల్లా కంపించి





పోసాగాడు. తా నిప్పుడు కన్న కల భవిష్యత్తులో, నిజం కాబోతున్నదన్న భయం అతణ్ణి పట్టుకున్నది. దొంగ అన్న వాడు, ఏనాటికైనా పట్టుబడి తీరుతాడు. అప్పుడు తన భార్యా, కొడుకు గతి ఏం కాను?

ఉగ్రశీలుడు యిలా ఆలోచించి, దూరంగా పడుకుని నిద్రపోతున్న తన పదిమంది అనుచరులను నిద్ర లేపి, "మనం యిక్కడి నుంచే తిరిగి వెళ్ళి పోదాం," అన్నాడు.

ఆ మాటలకు మిగతా దొంగలు నిర్ఘాంతపోయి, "ఇదేమిటి? మనం ఏనాడూ దోపిడీలకు బయలుదేరి, పని కాకుండా వెనక్కు తిరిగింది లేదు!" అన్నారు.

"నేను మీ నాయకుణ్ణి! ఇది, నా ఆజ్ఞ!" అన్నాడు ఉగ్రశీలుడు కళ్ళెర్ర చేసి, కత్తిపిడి మీద చేయివేస్తూ.

దొంగలందరూ అయిష్టంగానే అతడి వెంట, చీకటిపడేలోపల తమ స్థావరాలు చేరుకున్నారు. ఇది చూసి వాళ్ళ భార్యా బిడ్డలు చాలా ఆశ్చర్యపోయారు.

ఉగ్రశీలుడు అందర్నీ ఒకచోట సమావేశపరిచి, "మనుషులమై వుండీ, ఇంత కాలంగా మనం క్రూరమృగాల్లా బతుకుతున్నాం. ఇది, మన పిల్లలకు వారసత్వం కారాదు. మనం తెల్లవారుతూనే బయలుదేరి, రాజధానీనగరం చేరి, అక్కడి రాజభటులకు లొంగిపోదాం. మనకు శిక్ష పడినా, మన కుటుంబాలు గౌరవంగా, స్వేచ్ఛగా జీవించే అవకాశం వుంటుంది." అన్నాడు.

ఇందుకు మిగతా దొంగలు వ్యతిరేకించారు. తాము ఇంతవరకూ చేసిన నేరాలకు రాజు తమను కఠినంగా శిక్షిస్తాడనీ, అందువల్ల అరణ్యం వదిలి రామనీ, వాళ్ళు ఉగ్రశీలుడితో చెప్పారు.

"అది మీ యిష్టం. నేను మాత్రం రాజభటులకు లొంగిపోదలిచాను. మీరు తొందరపడకుండా తెల్లవారేలోపల మరొక

సారి తీరా ఆలోచించుకుని, ఒక నిర్ణయానికి రండి," అని సలహా యిచ్చాడు ఉగ్రశీలుడు.

ఉగ్రశీలుడి భార్యకు, భర్తలో వచ్చిన మార్పు చెప్పలేనంత ఆనందం కలిగించింది.

తన అనుచరులు, తన మాటకాదని ఎదురుతిరగడం, ఉగ్రశీలుడికి చాలా కోపం తెప్పించింది. ఆ రాత్రి అతడికి సరిగా నిద్రపట్టలేదు. రాత్రి మూడవ జాములో అతడు చల్లగాలికోసం బయిటికి వచ్చి, ఒక చెట్టుకింద నిలబడ్డాడు. కొంచెం దూరంలో చీకటిమరుగున అతడి అనుచరు లిద్దరు మాట్లాడుకోవడం, ఉగ్రశీలుడి చెవిని పడింది.

"కొడుకు పుట్టాక, ఉగ్రశీలుడు పూర్తిగా మారిపోయాడు. అతడు వెళ్ళి లొంగిపోయాక, రాజభటులు అతణ్ణి నానా హింసలు పెట్టయినా, మన ఆచూకీ తెలుసుకుంటారు. అందువల్ల, అతడు నిద్రలో వుండగానే, మొత్తం కుటుంబాన్ని హతం చెయ్యాలి," అన్నాడొక అనుచరుడు.

"ఇందుకు నేను సిద్ధమే. మిగతా వాళ్ళకూ్కడా సంగతి చెప్పి, వాళ్ళ సాయం కోరదాం," అన్నాడు మరొకడు మెల్లగా.



ఈ సంభాషణ విన్న ఉగ్రశీలుడు తనకూ, తన కుటుంబానికీ రానున్న ప్రమాదం గ్రహించాడు. అతడు అప్పటికప్పుడే భార్యనూ, కొడుకునూ నిద్రలేపి, గుర్రం మీద రాజధానికి ప్రయాణమయ్యాడు.

రెండు రోజుల తరవాత, సూర్యాస్తమయవేళ అతడు రాజధానీనగరాన్ని సమీపించాడు. అతడు గుర్రాన్ని అక్కడే వదిలి కాలినడకన భార్యనూ, కొడుకునూ వెంటపెట్టుకుని నగరం ప్రవేశించాడు. సంవత్సరాల తరబడి అరణ్యంలో వున్న ఉగ్రశీలుడి భార్యకు అంత జనం మధ్య నడవడం చాలా శ్రమ అనిపించింది.



వాళ్ళు ఆ రాత్రి ఒక సత్రంలో బస చేశారు. ఒక రాత్రివేళ ఉగ్రశీలుడు, భార్యతో, "నేను తెల్లవారుతూనే రాజ భటులకు లొంగిపోతాను," అన్నాడు.

అతడి భార్య ఆ మాటలకు బెంబేలు పడిపోతూ, "మమ్మల్ని యిక్కడి జన సముద్రంలో వదిలి, నువ్వు చెరసాలకు పోతే, మాకు దిక్కెవరు? కావాలంటే, మా యిద్దరికీ యింత విషం యిచ్చి, తరవాత వెళ్ళు," అన్నది.

ఇప్పుడు ఉగ్రశీలుడికి తాను ఊహించని ఒక కొత్త సమస్య ఎదురయింది. తాను వెంట తెచ్చిన డబ్బుతో, నగరంలో ఏదైనా వ్యాపారం చేస్తూ బతకవచ్చు. కాని, తాను గజదొంగ ఉగ్రశీలుడన్న విషయం ఎన్నాళ్ళు దాగుతుంది? ఏదో ఒకనాడు అది బయటపడితే, తాను రాజు వల్ల మరింత కఠినశిక్షకు గురవుతాడు. అలాకాక, తాను సరాసరి రాజు దగ్గిరకు పోయి, సంగతి చెప్పి లొంగిపోతే తక్కువ శిక్షతో బయటపడవచ్చు!

ఉగ్రశీలుడు యిలా ఆలోచించి, ఒక రాత్రివేళ భార్యా, కొడుకూ గాఢనిద్రలో వుండగా, అక్కణ్ణించి బయలుదేరాడు. ఆరితేరిన గజదొంగ అయిన అతడికి రాజ ప్రాసాదపు కాపలావాళ్ళ కనుగప్పి, రాజుగారుండే గదిని ప్రవేశించడం ఏమంత కష్టం కాలేదు. కాని, అతడు ఆయన నిద్రిస్తున్న శయ్యను సమీపిస్తూండగా, కాలికి రకరకాల ఫలాలున్న పళ్ళెం తగిలి, అది కిందపడడంతో శబ్దమైంది.

ఆ శబ్దం విన్న కాపలాభటులు, "దొంగ! దొంగ!" అంటూ అక్కడికి పరుగున వచ్చి, ఉగ్రశీలుణ్ణి వడిసి పట్టుకున్నారు.

ఇంతలో నిద్రాభంగం అవడంతో రాజు సత్యేంద్రుడు శయ్య మీద లేచి కూర్చున్నాడు. ఉగ్రశీలుడు తాను దొంగతనానికి రాలేదంటూ అరవ సాగాడు.

"వాడి దగ్గిర ఏం ఆయుధాలున్నవో, ముందు వెతకండి," అన్నాడు రాజు.

కాపలావాళ్ళు, ఉగ్రశీలుడి దుస్తులు వెతికి చూశారు. వాళ్ళకు ఏ ఆయుధం కనిపించలేదు.

"వాణ్ణి యిక్కడే వదిలి, మీరు వెళ్ళండి!" అని రాజు కాపలావాళ్ళను ఆజ్ఞాపించాడు.

కాపలావాళ్ళు వెళ్ళిపోయాక రాజు, ఉగ్రశీలుణ్ణి, "నువ్వు దొంగతనానికి కాక పోతే, మరెందుకు యిక్కడికి వచ్చావు?" అని అడిగాడు.

ఉగ్రశీలుడు తల వంచి రాజుకు నమస్కరించి, "మహారాజా, చేసిన నేరాలకు తమ నుంచి శిక్ష పొందేందుకు యిక్కడికి వచ్చాను. రాజభటులకు లొంగితే, నన్ను బహిరంగ విచారణ చేస్తారు. అప్పుడు నా భార్యా, కొడుకూ చాలా అవమానాలపాలు కావలసి వస్తుంది," అంటూ తన కథ యావత్తూ ఆయనకు చెప్పాడు.

రాజు అంతా శ్రద్ధగా విని తృప్తిగా తలాడించి, పక్క గదిలోకి పోయి, ఒక చిన్న మూటతో తిరిగి వచ్చి, "ఉగ్రశీలా, ఇందులో వంద బంగారుకాసులున్నవి. వచ్చే సంవత్సరం సరిగ్గా యిదే రోజున, నువ్వు నాకు రెండువందల బంగారు కాసులు తెచ్చియివ్వాలి. ఆ డబ్బు కష్ట పడి సంపాయించినదయి వుండాలి;



గుర్తుంచుకో!" అంటూ ఆ మూటను ఉగ్రశీలుడి కిచ్చాడు.

తరవాత ఆయన చప్పట్లుచరిచి కాపలా వాళ్ళను పిలిచి, "ఇతణ్ణి మర్యాదగా తీసుకుపోయి, రాజమార్గం మీద వదిలి రండి," అని చెప్పాడు.

కాపలావాళ్ళు అలాగే చేశారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గజదొంగ అయిన ఉగ్రశీలుడు దొరికి నప్పుడు, రాజు సత్యేంద్రుడు వాణ్ణి శిక్షించకపోగా, అలా వంద బంగారుకాసు లిచ్చి పంపడం వక్రబుద్ధి అనిపించుకోదా? ఉగ్రశీలుడు యికముందు దారిదోపిడీలకూ, దొంగతనాలకూ పాల్పడడన్న

నమ్మకం ఏమిటి ? రాజు గనక సత్యేంద్రుడికి అనేకమంది భటులూ, కాపలావాళ్ళూ వుంటారు. అతడికి ఎలాంటి దొంగల భయమూ లేకపోవచ్చు. కాని, సామాన్య పౌరుల మాటేమిటి ? మరొక సంగతి : ఉగ్రశీలుడిలో పరివర్తన వచ్చినదనుకున్నా, వాడు అరణ్యంలో విడిచి వచ్చిన దొంగలముఠా చెక్కు చెదరక అలాగే వున్నది కదా? ఇదంతా చూసినప్పుడు, రాజు అనాలోచితంగా, ఆ క్షణాన తోచినదేదో చేశాడనిపించడం లేదా ? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజు సత్యేంద్రుడు, ఉగ్రశీలుణ్ణి అలా శిక్షించక వదలడంలో, చాలా విజ్ఞత చూపాడు. అసలు శిక్ష ఉద్దేశం, నేరస్థుడు తన తప్పు తెలుసుకునేలా చేయడం; అతడిలో పరివర్తన తీసుకురావడం. అంతే కాని అతణ్ణి శారీరకంగా హింసించడం కాదు. కాదన్న తన అనుచరులను ధిక్కరించి, తను చేసిన నేరాలకు శిక్ష పొందాలని నగరానికి రావడమే, ఇకముందు ఉగ్రశీలుడు దొంగతనాలజోలికి పోడనేందుకు తిరుగులేని సాక్ష్యం. వాడు తన కథ అంతా రాజుకు చెప్పాడు. ఆ విధంగా రాజుకు గజదొంగ అనుచరులెక్కడ వున్నదీ తెలిసింది. వాళ్ళు, తమ నాయకుణ్ణి శిక్షించక వదిలిన రాజు దయాగుణం గురించి ఏదో ఒకనాడు వినకపోరు. అప్పుడు, వాళ్ళూ ఉగ్రశీలుడి లాగే రాజు దగ్గిరకొచ్చి క్షమాభిక్ష కోరవచ్చు. అలా జరగకపోతే, రాజు సైనికులను పంపి వాళ్ళను పట్టి బంధించగలడు. ఈ అన్ని కారణాలవల్లా రాజు వక్రబుద్ధీ, ఏ క్షణాన ఏది తోస్తే, అది చేసేవాడు కాకపోగా, ఎంతో ఆలోచనా, తర్కదృష్టీ, వివేకం కలవాడని తెలుస్తున్నది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# మందూ-తాయెత్తూ

వల్లభాపురం అనే గ్రామంలో సుధీరుడు, విశాల అనే భార్యాభర్తలుండేవాళ్ళు. ఒకసారి వాళ్ళ అయిదేళ్ళ కొడుక్కు జబ్బు చేసింది. ఆ గ్రామంలో మంచి వైద్యుడు లేడు. అందువల్ల పక్క ఊళ్ళో బాగా పేరు ప్రఖ్యాతులున్న వైద్యుడి దగ్గిరకు వెళ్ళాడు, సుధీరుడు. వైద్యుడు అతడికి వారం రోజులకు సరిపడా మందు యిచ్చాడు.

వారం గడిచాక కూడా కొడుకు జబ్బు తిరుగుముఖం పట్టకపోవడంతో, విశాలకు ఆందోళన కలిగింది. ఆమెకు వైద్యుడిచ్చిన మందు మీద గురి కుదరలేదు. ఆ గ్రామంలోనే వున్న దేవీఉపాసకుడు పాపన్న యిచ్చే తాయెత్తు అంటే, ఆమెకు నమ్మకం. ప్రతి శుక్రవారం దేవీపూజ తరవాత, పాపన్న యిచ్చే తాయెత్తుల కోసం, దూరప్రాంతాల నుంచి కూడా జనం వస్తూంటారు. విశాల, భర్తతో పాపన్న దగ్గిరకు వెళ్ళి తాయెత్తు తెమ్మన్నది.

"అది అమాయకులు చేసే పని. ఆ తాయెత్తులకోసం వచ్చే వాళ్ళతో, నేను లోగడ చాలాసార్లు మాట్లాడి వున్నాను. వాళ్ళది కేవలం మూఢత్వం. మందు కుదర్చలేని జబ్బు, తాయెత్తు కుదురుస్తుందా? మళ్ళీ వైద్యుడి దగ్గిరకు వెళ్ళి సంగతి చెప్పి, ఆయనిచ్చే మందు తెస్తాను. నువ్వేమీ ఆదుర్దా పడకు," అన్నాడు సుధీరుడు.

ఈసారి సుధీరుడు వెళ్ళేసరికి వైద్యుడు ఇంట్లో లేడు. ఆయన భార్య చాలా కాలంగా అనారోగ్యంతో బాధపడుతున్నది. పాపన్న నడిగి తాయెత్తు తెచ్చేందుకు వైద్యుడు సుధీరుడి గ్రామమే వెళ్ళినట్టు, ఇంట్లో వాళ్ళు చెప్పారు.

కుప్పాల వెంకటసుబ్బారావు

ఇది విని సుధీరుడికి చాలా ఆశ్చర్యం కలిగింది. అతను తిరిగి గ్రామం వచ్చే సరికి పాపన్న ఇంటి ముందు చాలా మంది జనం వున్నారు. వాళ్ళల్లో వైద్యుడు కనిపించగానే సుధీరుడు, ఆయనకు తన కొడుకు పరిస్థితి చెప్పాడు.

వైద్యుడు తన చేతి సంచీలోంచి ఏదో మందు తీసి సుధీరుడికి యిచ్చి, దాన్ని మరొక వారం రోజులు వాడి, తరవాత కుర్రవాడికి ఎలావున్నదీ వచ్చి చెప్ప మన్నాడు.

సుధీరుడు, మందు తీసుకుని, వైద్యుడితో, "వైద్య శాస్త్రంలో ఉద్దండులనిపించుకున్న మీరే, యిలా తాయెత్తుకోసం రావడం, నేను నమ్మలేకుండా వున్నాను," అన్నాడు.

ఆ మాటలకు వైద్యుడు నవ్వి, "తాయెత్తు మహిమను నేను నమ్మినా, నమ్మకపోయినా—ఇంతకాలంగా నేనిచ్చిన మందులు పని చేయకపోవడంతో, నా భార్యకు యీ తాయెత్తు పట్ల ఆసక్తి కలిగింది. ఆమెకు వైద్యశాస్త్రం తెలియక పోయినా, మందులు పనిచేసే తీరు కొంత తెలుసు. ఏ మందు తయారు చేసేందుకు ఏఏ మూలికలూ, వస్తువులూ వాడుతానో, ఆమె ఎరుగు. అన్నిటికన్న ముఖ్యం, రోగికి వైద్యుడిచ్చే మందుపట్ల నమ్మకం వుండాలి. అది నా భార్యలో లోపించిందని గ్రహించాను," అన్నాడు.

సుధీరుడు వైద్యుడిచ్చిన మందు తీసుకుని ఇల్లు చేరాడు.

అతను మందు కోసం పక్క గ్రామం వెళ్ళినప్పుడు, అతడి భార్య విశాల పాపన్న దగ్గరకు పోయి తాయెత్తు తెచ్చింది. దాన్ని రహస్యంగా కొడుకు మొలతాడులో కనిపించకుండా కట్టింది.

వారం రోజుల తర్వాత సుధీరుడి కొడుకు కోలుకున్నాడు. వైద్యుడు రెండో సారి యిచ్చిన మందు పని చేసిందని సుధీరుడు అనుకున్నాడు; పాపన్న ఇచ్చిన తాయెత్తువల్లనే జబ్బు నయమయిందని, విశాల అనుకున్నది.





# దానహీనుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఆయన వద్ద కోశాధికారిగా జన్మించాడు. ఆయన ఎనభై కోట్లకు అధిపతి అయి ఉండి కూడా, ప్రపంచంమీద వైరాగ్యం కలిగి, తన ధనాన్ని రాజుగారిని స్వీకరించమని కోరాడు.

"నాకు ధనలోపం ఏమీలేదు. అందుచేత నీ ధనాన్ని మరొక విధంగా వినియోగించుకో!" అని రాజు జవాబిచ్చాడు. అప్పుడు కోశాధికారి రాజుగారి అనుమతితో కాశీనగరంలో ఆరు అన్నసత్రాలు ఏర్పాటు చేశాడు. ఈ సత్రాలలో భారీగా దానధర్మాలు జరుగుతూ వచ్చాయి. ప్రతిరోజూ ఒక్కొక్క లక్ష చొప్పున ఖర్చు అవుతూండేది.

ఈ అన్నసత్రాలు ఏర్పాటు చేసిన ఫలితంగా కోశాధికారి చనిపోయిన అనంతరం స్వర్గంలో ఇంద్రపదవి సంపాదించాడు. ఆయన కుమారుడు తండ్రి అడుగుజాడలలోనే నడిచి చనిపోయి చంద్రుడుగా పుట్టాడు. చంద్రుడి కొడుకు సూర్యుడుగా పుట్టాడు. సూర్యుడి కొడుకు మాతలిగానూ, మాతలి కొడుకు పంచశిఖాగ్నిగానూ పుట్టి దేవత్వం సంపాదించుకున్నారు.

కాని పంచశిఖుడి కుమారుడి వద్దకు వచ్చేసరికి వంశాచారం నిర్మూలమైపోయింది. ఎందుచేతనంటే పంచశిఖుడి కొడుకు ఎనభై కోట్లకు అధిపతి అయినప్పటికీ పరమలోభి. అతన్ని ప్రజలు మచ్చరికోశియుడని పిలిచేవారు. తన తండ్రి పోగానే అతను అన్నసత్రాలన్నీ మూయించి, భవనాలను తగలబెట్టి నేలమట్టం చేయించాడు. తన పూర్వీకులు కేవలం మూఢులై డబ్బంతా దానధర్మా



లలో నష్ట పరిచారని ఆయన అను కున్నాడు.

అన్నసత్రాలు మూయగానే నగరం లోని బీద బిక్క జనం మచ్ఛరికోశియుడి ఇంటిముందు మూగి, ''బాబూ, ధర్మం మానకండి! సత్రాలు మూయకండి!'' అని ఆక్రోశించారు. మచ్ఛరికోశియుడు మనుషులను పెట్టి ఈ పేదవాళ్ళందరినీ తన ఇంటి ముందునుంచి గెంటించాడు.

మచ్ఛరికోశియుడు కోటీశ్వరుడు, తన తాత తండ్రులలాగే రాజుగారివద్ద కోశాధి కారిగా పని చేస్తున్నాడు. కాని అయన తన డబ్బుతో ఎన్నడూ సుఖం అనుభ వించి ఎరగడు. తాను కడుపునిండా తిని ఎరగడు సరేకదా, తన భార్యా బిడ్డలను కూడా తిన నిచ్చేవాడుకాడు. ఆయన గొడ్డుకారం మెతుకులు తిని పులిమజ్జిగ తాగేవాడు. నారబట్టలు కట్టుకునేవాడు, ఇరుసులు అరిగిపోయిన పాతబండికి బక్కచిక్కిన ఎద్దులు కట్టి, ఆ బండిమీద ఎక్కడికైనా వెళుతుండేవాడు.

ఒకనాడు ఈ పిసినిగొట్టు రాజసభకు పోతూ, ఉపకోశాధిపతిని కూడా వెంట బెట్టుకు పోదామని వారి ఇంటికి వెళ్ళాడు. సరిగా ఆ సమయానికి ఉపకోశాధిపతీ, ఆయన భార్యా, పిల్లలూ విస్తళ్ళముందు కూచుని చక్కెరపొంగలి తింటున్నారు. కోశాధికారిని చూడగానే ఉపకోశాధిపతి లేచి, ఆయనను కూడా చక్కెరపొంగలి తినటానికి రమ్మని ఆహ్వానించాడు.

''ఇప్పుడు నేను వీడి ఆతిథ్యం స్వీకరించి ఈ చక్కెరపొంగలి తింటే, రేపు నేను వీడి ఇంటిల్లిపాదినీ పిలిచి విందు చేయవలసి ఉంటుంది!'' అని భయపడి మచ్ఛరికోశియుడు, ''నాకు ఆకలి లేదు. నేనింతకుముందే కడుపు నిండా తిని వచ్చాను, మీరు కానివ్వండి!'' అన్నాడు.

కాని ఆ క్షణంనుంచే మచ్ఛరికోశి యుడికి చక్కెరపొంగలి తినాలని తీవ్ర మైన కోరిక పట్టుకున్నది. కాని ఇంట్లో

వండిస్తే తనతోబాటు ఇంకా చాలామంది తింటారు. అందుచేత ఆయన తన కోరికను ఎవరిదగ్గిరా బయటపెట్టక, లోలోపల కుమిలిపోతూ, మనోవ్యాధితో మంచం పట్టాడు.

ఆయన భార్య వచ్చి, "మీకు వంట్లో జబ్బుగా ఉందా?" అని అడిగింది. "నీకేమైనా జబ్బేమో, నేను బాగానే ఉన్నాను!" అన్నాడాయన. కాని భార్య వదలిపెట్టక అసలు సంగతి తెలుసుకున్నది. అంతా విని ఆమె, "మనమేం దరిద్రులమా? చక్కెరపొంగలి కోసం మనోవ్యాధి పడాలా? కాశీనగరంలో ఉన్న జనాభాకంతకీ చక్కెరపొంగలి వండిస్తాను!" అన్నది.

"మీ పుట్టింటివాళ్ళు చాలా భాగ్యవంతులని నాకు తెలుసులే. అక్కడినుంచి తవ్వి తెచ్చి ఊరంతకీ చక్కెరపొంగలి సంతర్పణ చెయ్యి!" అన్నాడు పిసినిగొట్టు. కనీసం వీధిలోవాళ్ళందరినీ పిలుద్దామన్నది భార్య. వాళ్ళందరితోటీ నీకేమిటన్నాడు భర్త. అయితే కనీసం మనింటిల్లిపాదికీ చక్కెరపొంగలి వండుతానన్నది భార్య. భర్త ఏమాత్రం వీల్లేదన్నాడు.

"సరే అయితే మీకూ, నాకూ వండుతాను," అన్నది భార్య.



"మధ్య నువు దేనిక?" అన్నాడు భర్త కోపంగా.

"అయితే మీ ఒక్కరికోసమే వండుతాను. సరా?" అన్నది భార్య.

"అసలు ఇంట్లో వండటానికి వీల్లేదు. ఇంత బియ్యమూ, పాలు, నెయ్యి, తేనేనా చేతికియ్యి. వంటపాత్రలు కూడా ఇయ్యి. నేను అడివిలోకి వెళ్ళి చక్కెర పొంగలి వండుకుని తింటాను!" అన్నాడు భర్త.

భార్య ఆయనకు కావలసిన వస్తువులన్నీ ఇచ్చింది. వాటిని ఒక బానిసవాడిచేత మోయించుకుని మచ్చరికౌశియుడు ముసుగు కప్పుకుని, నదీ తీరం వెంబడి ఉండే అరణ్యానికి వెళ్ళాడు. నదీతీరాన



ఒకపొద పక్కన పొయ్యి ఏర్పాటు చేసి తన నౌకరుచేత వంటకట్టెలు, నీరూ తెప్పించి, వాణ్ణి వెళ్ళి రహదారిమీద నిలబడమన్నాడు. "ఎవరన్నా దారివెంట వస్తుంటే నాకు తెలియజెయ్యి. నీతో నాకు పని ఉంటే కేకవేస్తాను. నేను పిలిస్తే గాని రాకు!" అని వాడితో చెప్పాడు.

ఈలోపల ఇంద్రుడు తన ఆరవ తరం వాడైన మచ్ఛరికోశియుణ్ణి గురించి తెలుసుకున్నాడు. "పంచశిఖుడు దాకా అందరూ దానధర్మాలు చేసి దేవత్వం పొందితే, పంచశిఖుడి కొడుకు పిసినిగొట్టయి, వంశాచారాన్ని మంటకలిపి, చక్కెరపొంగలి తాను ఒక్కడే తినగలందులకై అడవిలోకి వచ్చి వంట చేసుకుంటున్నాడు. నేను వీడికి జ్ఞానోదయం కలిగించకపోతే వీడు నరకానికి పోతాడు!" అనుకుని ఇంద్రుడు చంద్రుణ్ణీ, సూర్యుణ్ణీ, మాతలినీ, పంచశిఖుణ్ణీ పిలిపించి వారితో తాను చేయదలచిన పనిని గురించి చెప్పాడు.

తరువాత ఇంద్రుడు బ్రాహ్మణ వేషం ధరించి మచ్ఛరికోశియుడు వంట చేసుకునే చోటికి వెళ్ళి, "ఇదిగో, కాశీకి దారి ఎటు?" అని అడిగాడు.

"కాశీకి దారే తెలియదూ? ఇటుకేసి వస్తున్నావేమిటి? పో అవతలికి!" అని మచ్ఛరికోశియుడు కేకలు పెట్టాడు.

"ఎందుకలా అరుస్తున్నావు? చక్కెర పొంగలి చేస్తున్నావే? బ్రాహ్మణ సంతర్పణ చేస్తున్నావు కాబోలు. వాళ్ళతో బాటు నేను కూడా పంక్తిని కూచుంటాను!" అన్నాడు ఇంద్రుడు నవ్వుతూ.

"సంతర్పణా లేదు, గింతర్పణా లేదు! పద, పద!" అని మచ్ఛరికోశియుడు అతణ్ణి అదిలించాడు.

"ఎందుకు నాయనా, అంత కోపగించుకుంటావు. అభ్యాగతిని, నీతోబాటు ఆ వండినదేదో ఇంత పెడితే పుణ్యమే గాని పాపం రాదే!" అన్నాడు ఇంద్రుడు.

"నేను నీకు ఒక్క మెతుకు కూడా పెట్టను. ఇది నాకే చాలదు. నేనే

ముష్టెత్తి తెచ్చుకున్నాను, అందులో మళ్ళీ నీకు ముష్టా? అదేం కుదరదు!'' అన్నాడు మచ్ఛరికోశియుడు.

''కొంచెంలో కొంచెమే దానం చెయ్యి. ఎక్కువ ఉంటే ఎక్కువ దానం చెయ్యి. ఒంటిగా ఎన్నడూ తినరాదు. దానంవల్ల ఉత్తమ లోకాలు కలుగుతాయి!'' అని ఇంద్రుడు బోధ చేశాడు. చిట్టచివరకు మచ్ఛరికోశియుడు, ''సరే, అలా కూచో, నీకూ్కడా కొంచెంగా చక్కెరపొంగలి పెడతాను!'' అన్నాడు.

ఇంతలో చంద్రుడు కూడా బ్రాహ్మణ వేషం ధరించి వచ్చి చక్కెరపొంగలి యాచించాడు. అతన్ని కూచోమనక మచ్ఛరికోశియుడికి తప్పలేదు. తరవాత సూర్యుడూ, మాతలీ, పంచశిఖుడు కూడా బ్రాహ్మణ వేషాలలో వచ్చి పక్కనే తిష్ఠవేశారు.

త్వరలోనే చక్కెరపొంగలి తయారయింది. ''వడ్డిస్తాను, ఆకులు తెచ్చుకోండి!'' అన్నాడు మచ్ఛరికోశియుడు. బ్రాహ్మణులు చేతులు చాచేసరికి వారి చేతుల్లోకి పెద్ద పెద్ద బండి చక్రాలంత తామరాకులు వచ్చాయి.

''ఇంతంత పెద్ద ఆకుల్లో నేను వడ్డించను. మందార పత్రాలలాటివి తెచ్చుకోండి!'' అన్నాడు మచ్ఛరికోశియుడు.



వాళ్లు మందారపత్రాలు తెచ్చుకున్నా, అవి పెద్ద అరటి ఆకుల ప్రమాణంలో ఉన్నాయి. మచ్ఛరికోశియుడు చక్కెర పొంగలి వడ్డించాడు. వారందరికీ పెట్టినా పాత్రలో ఇంకా చాలా చక్కెరపొంగలి మిగిలిపోయింది.

ఇంతలో పంచశిఖుడు కుక్క రూపం ధరించి ఆ పాత్రలో మూతి పెట్టబోయాడు. సమయానికి మచ్ఛరికోశియుడు పాత్రకు తన చేతులు అడ్డం పెట్టాడు. కాని ఆయన చేతులకు కుక్క ఎంగిలి తగిలింది.

''నేను చెయ్యి కడుక్కోవటానికి కాసిని నీళ్ళు తెచ్చి పెట్టండి!'' అని ఆయన బ్రాహ్మణులను కోరాడు. వారు

నిర్మోహమాటంగా, "మేము తీసుకు రాము!" అని చెప్పారు.

"నా చక్కెరపొంగలి తింటూ అమాత్ర మైనా విశ్వాసం లేదా?" అని మచ్ఛరికోశియుడు వారిని అడిగాడు. వారు ససేమిరా తీసుకురామన్నారు. "అయితే నా పాత్రను కాస్త చూస్తూ వుండండి. నేనే వెళ్ళి నీళ్ళు తెచ్చుకుంటాను!" అంటూ మచ్ఛరికోశియుడు నదివద్దకు దిగి వెళ్ళసాగాడు. వెంటనే కుక్క చక్కెరపొంగలి వున్న పాత్రలో మూతి పెట్టేసింది.

మచ్ఛరికోశియుడికి కోపం వచ్చి, ఒక కర్ర తీసుకుని కుక్క వెంట పడ్డాడు. అయితే ఆ కుక్క అంతలోనే గుర్రం ఆకారం ధరించి మచ్ఛరికోశియుణ్ణే తరమ సాగింది. అది క్షణక్షణానికీ రంగులు మారుతూ, తాన్సేపు చిన్నదవుతూ, కాస్సేపు పెద్దదవుతూ కనపడింది. మచ్ఛరికోశియుడు ప్రాణభీతితో గిజగిజ లాడాడు. అతడు బ్రాహ్మణులను, "బాబూ, నన్ను ఈ గుర్రం బారినుండి రక్షించండి!" అని కోరాడు.

వెంటనే ఆ అయిదుగురూ తమ నిజ స్వరూపాలతో గాలిలోకి లేచి నిలబడ్డారు.

"మీరు మనుషులు కారు, దేవతలు! మీ పేర్లేమిటో, ఎందుకు దయచేశారో చెప్పండి!" అన్నాడు మచ్ఛరికోశియుడు.

"మేము నీ పితృదేవతలం. మానవ జన్మ ఎత్తి దానాలు చేసిన ఫలితంగా దేవత్వం సంపాదించుకున్నాం. నువు లోభివై, వంశాచారాన్ని మంట గలిపి నరకం సంపాదించుకుంటున్నావు. నీకు గుణపాఠం చెప్పే నిమిత్తమై వచ్చాం! ఇంటికి పోయి దానధర్మాలు చేసి మాలాగే దేవత్వం సంపాదించుకో!" అన్నాడు ఇంద్రుడు.

మచ్ఛరికోశియుడి బుద్ధి మారి పోయింది. ఆయన ఇంటికి వెళ్ళి తన ధనమంతా పేదలకు దానం చేసి, తపస్సు చేసుకోవటానికి హిమాలయాలకు వెళ్ళి పోయాడు.






# స్వాతంత్ర్యసిద్ధి

1939వ సంవత్సరం పశ్చిమదేశాలలో ప్రారంభమయిన యుద్ధం, క్రమంగా తూర్పు దేశాలకు పాకసాగింది. అజేయమైన దేశంగా పేరుగాంచిన ఇంగ్లాండు, హఠాత్తుగా బలీయమైన శత్రుదేశం — జర్మనీని ఎదుర్కోవలసి వచ్చింది. విమానాల నుంచి బాంబులు వేయడం సులభం కావడంవల్ల, యుద్ధాలు మరీ భీకరంగా తయారయ్యాయి.

జర్మనీ నియంత హిట్లర్, కనీ వినీ ఎరుగని హింసాకాండకూ, క్రూరకృత్యాలకూ పాల్పడ్డాడు. స్టాలిన్ ఆధిపత్యంలో వున్న రష్యాతో మొదట మైత్రి పాటించి, హఠాత్తుగా దాడి జరిపాడు. హిట్లర్ యూదులను తీవ్రంగా ద్వేషించాడు. తన దేశంలోనూ, తను వశపరచుకున్న దేశాలలోనూ వున్న లక్షలాది యూదులను అతడు ఊచకోత కోయించాడు.





ఆసియా ఖండంలోని జపాను, హిట్లర్‌తో చేతులు కలిపింది. జపాను చక్రవర్తి హిరోహిటో శాంతికాముకుడే అయినప్పటికీ, రాజకీయ నాయకులూ, సైన్యాధిపతులూ దురాశాపరులు. ముసోలినీ నియంతృత్వ పాలనలో వున్న ఇటలీ కూడా జర్మనీ, జపాను దేశాలతో జత చేరింది.



బ్రిటన్ మొదలైన దేశాలతో అమెరికా చేరడంతో, యుద్ధం ద్వితీయ ప్రపంచ సంగ్రామంగా ఉధృతమయింది. స్వాతంత్ర్యం ఇస్తామని మాట ఇస్తే, తాము బ్రిటన్‌తో సహకరించగలమని గాంధీజీ తెలియజేశాడు. కానీ హామీ రాలేదు. బ్రిటిష్ వాళ్ళను దేశంవదిలి పొమ్మనే 'క్విట్ ఇండియా' ఉద్యమం 1942వ సంవత్సరంలో ప్రారంభమయింది. స్వాతంత్ర్య వీరులను, బ్రిటిష్ ప్రభుత్వం ఖైదు చేసి హింసించసాగింది.

అదే సమయంలో బ్రిటిష్ పరిపాలనలో వున్న మలయా, సింగపూర్‌ల మీద జపాన్ దాడి జరిపింది. బ్రిటిష్ వారి కోటగా పరిగణింపబడే సింగపూర్ పతనం అందరినీ ఆశ్చర్యపరచింది. జర్మనీ, జపాను కూటమి (యాక్సిస్) దేశాల చేతిలో బ్రిటన్, అమెరికా మిత్ర దేశాలు ఓడిపోగలవన్న సమయం ఆసన్నమయింది.





బ్రిటిష్ వారిచే ఖైదు చేయబడిన భారత నేత సుభాస్‌చంద్రబోస్, కాబూలుకు తప్పించుకునిపోయి, 1943వ సంవత్సరంలో సింగపూర్ చేరుకున్నాడు. ఓడిపోయిన బ్రిటిష్ సైన్యంలోని భారతీయ సైనికులను సమీకరించి, భారత జాతీయ సైన్యం పేరిట స్వాతంత్ర్య వీరులకు శిక్షణ ఇవ్వసాగాడు. జర్మనీ, జపాన్ కూటమి దేశాల సాయంతో, ఆంగ్లేయులను భారతదేశం నుంచి తరుమగొట్టాలని ఆయన పథకం వేశాడు.

భారత జాతీయ సైన్యం అనేక అడ్డంకులను అధిగమించి, భారతదేశంకేసి పయనిస్తూ, మణిపూర్‌లోని కోహిమాను చేరుకున్నది. అయినా, చాలినంత ఆయుధాలు లేకపోవడంవల్ల, అక్కడినుంచి ముందుకు సాగలేకపోయింది. జపాను కూడా విజయావకాశాన్ని కోల్పోసాగింది. 1945వ సంవత్సరం ఆగస్టులో సుభాస్ చంద్రబోస్ రహస్యంగా మరుగయ్యాడు.





ఆ సమయంలోనే, ముస్లిమ్‌లీగ్ నాయకుడు మహమ్మదాలీ జిన్నా మహమ్మదీయులకు పాకిస్థాన్ పేరిట ప్రత్యేక ప్రాంతం కోరాడు. అతని కోరిక మంచిది కాదని నచ్చజెప్పడానికి దేశనాయకులెందరో ప్రయత్నించారు. అయినా, బ్రిటిష్‌వారు పరోక్షంగా అందించిన ప్రోద్బలంతో జిన్నా తన పట్టుదలను వదలలేదు.

ఎంతోకాలంగా సోదరభావంతో మసలుకుంటూన్న హిందూ, ముస్లిమ్ ప్రజా హృదయాలలో పాకిస్థాన్ వేర్పాటువాదం విషబీజాలను చల్లింది. తమ కోర్కెను నొక్కిచెప్పాలన్న ఉద్దేశంతో, ముస్లింలీగ్ 1946వ సంవత్సరం ఆగస్టు 16వ తేదీని ప్రత్యక్ష చర్యాదినంగా ప్రకటించింది. కలకత్తా, ఢిల్లీ మొదలైన ప్రాంతాలలో, మతకలహాల వల్ల, తీవ్ర రక్తపాతం జరిగింది. వేలకొలది అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోయారు.






స్వాతంత్ర్యోద్యమ నాయకుడూ, గొప్ప రాజకీయవేత్తా అయిన జవహర్‌లాల్ నెహ్రూ 1946వ సంవత్సరంలో ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వానికి నాయకత్వం వహించాడు. విభజన వాదాన్ని వదిలిపెట్టి, ప్రభుత్వంలో పాలుపంచుకోమని ముస్లింలీగ్‌కు నచ్చజెప్పడానికి నెహ్రూ ఎంతగానో ప్రయత్నించాడు. అయినా ముస్లింలీగ్ అంగీకరించలేదు. స్వాతంత్ర్యం కోసం గొప్ప త్యాగం చేయడానికి భారతదేశం సిద్ధం కాసాగింది.

ప్రపంచ యుద్ధంలో గొప్ప సేనానాయకుడుగా ప్రసిద్ధిగాంచిన మౌంట్‌బాటన్ ప్రభువు 1947వ సంవత్సరం భారతదేశానికి గవర్నర్ జనరల్ అయ్యాడు. అతనితో చర్చలు జరిపిన తర్వాత భారత విభజనకు, భారత జాతీయ కాంగ్రెస్ అంగీకరిస్తున్నట్టు నెహ్రూ 1947వ సంవత్సరం జూన్ 3వ తేదీ ప్రకటించాడు. అగస్టు 15న దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది.





భారత విభజన పర్యవసానంగా—మత కలహాలు, యుద్ధాలు, కాందిశీకులు మొదలైన సమస్యలు తలెత్తాయి. అయినా భారతీయులందరూ ఐకమత్యమే తమ బలమని గ్రహించి, అవరోధాలన్నిటినీ అధిగమిస్తూ గతమెంతో కీర్తిగాంచిన తమ దేశ సముజ్జ్వలమైన భవిష్యత్తు కోసం కలిసికట్టుగా ముందుకు సాగుతున్నారు.

# నిజాయితీ

కేశవరం ఒక జమీందారీ గ్రామం. దాదాపు అరవై ఏళ్ళపాటు గ్రామాధికారిగా వుండి, ఎంతో తెలివైనవాడూ, నిజాయితీపరుడూ అనిపించుకున్న గోపరాజు అనే అతను హఠాత్తుగా మరణించాడు. గ్రామస్థులు జమీందారు దగ్గిరకుపోయి, "గోపరాజుగారికి వారసులులేరు. కనక, తమరే అంత మంచి నిజాయితీపరుణ్ణి గ్రామాధికారిగా నియమించండి," అని కోరారు.

జమీందారు అలాగే అని వాళ్ళను పంపి, దివానుతో, "అధికారంలో వున్నప్పుడు గదా, మనిషిలో నిజాయితీ వున్నదీ లేనిదీ తెలిసేది! ఒక నిరుద్యోగికి, ఆ గ్రామాధికారి పదవి యివ్వబోతూ, ముందుగానే అతడి నిజాయితీ తెలుసుకోవడం ఎలా?" అన్నాడు.

"ఆ మాట నిజమే!" అని దివాను కేశవరం గ్రామాధికారి పదవికి అర్హతగల అభ్యర్థుల కోసం చాటింపు వేయిస్తూ, వాళ్ళు ముందుగా జమీందారుగారి ఖజానాదారును చూడవలసి వుంటుందని తెలియపరిచాడు.

వారం రోజుల తరవాత పదిమంది అభ్యర్థులు వచ్చి ఖజానాదారు దర్శనం చేసుకున్నారు. ఆయన విడివిడిగా వాళ్ళను తన కచ్చేరీ గదిలోకి పిలిచి మాట్లాడి, మర్నాడు పదిగంటల వేళ జమీందారుగారి దగ్గిరకు రావలసిందిగా చెప్పాడు. ఆ విధంగానే అందరూ జమీందారు దగ్గిరకు వెళ్ళారు. ఆ సమయంలో దివానూ, ఖజానాదారూ అక్కడే వున్నారు.

జమీందారు ఆ పదిమందిలో ఖజానాదారు చూపిన నాగవర్మ అనే అతణ్ణి, కేశవరం గ్రామాధికారిగా నియమిస్తున్నట్టు చెప్పాడు. ఆ వెంటనే మిగిలిన తొమ్మిదిమందీ, "అయ్యా, యిది అన్యాయం! మాకి ఉద్యోగం యిప్పిస్తానంటూ ఖజానాదారు, తలా వెయ్యి వరహాలూ లంచం తీసుకున్నాడు," అన్నారు.

అప్పుడు దివాను కల్పించుకుని, "ఖజానాదారు ద్వారా, యీ పరీక్షలు పెట్టించింది, నేనే! గ్రామాధికారి పదవి కోసం లంచాలిచ్చే మీరు, రేపు ఆ పదవిలో లంచాలు పుచ్చుకోరన్న నమ్మకం ఏమిటి? మీలో నిజాయితీ లేదు. లంచం యివ్వ నిరాకరించిన నాగవర్మ, ఆ పదవికి అర్హుడనేదాంట్లో సందేహం లేదు," అన్నాడు.

—కె. కె. రావు





# రెండు నగరాలు

ఒక ఓడవ్యాపారి వద్ద వామాంగు డనే ఒక బానిస ఉండేవాడు. వామాంగుడు తన వ్యాపారంలో ఎంతో సహాయపడి, లాభాలు సమకూర్చి పెట్టటం చేత యజమాని అతనికి స్వేచ్ఛ ఇస్తూ, ''నా ఓడల్లో ఒకటి తీసుకుని స్వతంత్రంగా వర్తకం సాగించి, బాగుపడు,'' అన్నాడు.

వామాంగుడి తొలి వర్తక ప్రయాణం అచ్చిరాలేదు. సముద్ర మధ్యంలో తుఫాను వచ్చి, సరుకులన్నిటితో సహా అతని ఓడ మునిగిపోయింది. నావికులంతా సముద్రం పాలయ్యారు. వామాంగుడు మాత్రం ఈదుకుంటూ వెళ్ళి ఒక తీరాన్ని చేరుకున్నాడు.

అది ఒక చిన్న ద్వీపం. వామాంగుడు ద్వీపంలోకి ప్రవేశించి, కొంత దూరం నడిచి, అందమైన ఒక పెద్ద నగరం చేరుకున్నాడు.

నగర వీథుల నిండా జనమున్నారు. వారు తన కోసమే గుంపులుగా కూడినట్టు వామాంగుడికి కనిపించింది. అతను సమీపానికి రాగానే, ''మహారాజుకు జై!'' అని జనం నినాదాలు చేశారు. ఇది చూసి వామాంగుడు మరింత ఆశ్చర్యపడి, ''వీళ్ళు నన్ను చూసి మరొకరని భ్రమపడుతున్నట్టున్నారు,'' అనుకున్నాడు.

జనం వామాంగుడి చుట్టూ మూగారు. అక్కడికి అలంకరించిన ఏనుగు ఒకటి వచ్చింది.

జనం వామాంగుణ్ణి దాని అంబారీలో ఎక్కించి, రాజమర్యాదలతో రాజభవనానికి తీసుకుపోయారు.

తరవాత రాజభవనంలో అతని దుస్తులు తీసివేసి ఒక పెట్టెలో భద్రపరిచి, అతనికి స్నానం చేయించి, రాజోచితమైన దుస్తులు ధరింపజేశారు.

వామాంగుడు తన చుట్టూ ఉండే వారిని, "మీరు నన్నీవిధంగా రాజును చెయ్యటంలోగల అంతరార్థమేమిటి? నన్ను మీరెరగరు. మిమ్ము నేనెరగను. ప్రమాదవశాన సముద్రం మీద నా ఓడ మునిగి దైవికంగా ఇక్కడ వచ్చి పడ్డాను. అంతేకాని పని పెట్టుకుని ఈ దేశం వచ్చినవాణ్ణి కాను," అన్నాడు.

అప్పుడక్కడివారు అతనికి ఆ దేశం గురించి చెప్పారు. ఇరవైరెండేళ్ళ క్రితం దాకా ఆ ద్వీపం మీద క్రమపరిపాలన అంటూ ఉండేది కాదు. జీవితం అరాజకంగా ఉండేది. ఆ సమయంలో ఆ ద్వీపానికొక దేశసంచారి వచ్చాడు. ఒక రాజు ఉండి శాసించినట్టయితే జీవితం క్రమబద్ధంగా అభివృద్ధి చెందుతుందనీ, రాజశాసనం ద్వారా పైకి వచ్చిన దేశాలెన్నో ఉన్నాయనీ, రాజు నిరంకుశుడై ప్రజలను పీడించకుండా ఉండాలంటే ఏడాది కాగానే ఉన్న రాజును తొలగించి కొత్త రాజును పెట్టుకోవచ్చుననీ, రాజు ప్రజలలో ఒకడుగా ఉండేదానికన్న పైవాడైతే పరిపాలన నిష్పక్షపాతంగా ఉంటుందనీ, ఆ దేశ సంచారి చెప్పాడు. అది మొదలు అక్కడివాళ్ళు యాదృచ్ఛికంగా తమ ద్వీపానికి వచ్చేవాణ్ణి రాజుగా చేసుకుని, అతన్ని పరిపాలించనిస్తున్నారు. ఏడాది పూర్తికాగానే రాజును తొలగించి సమీపంలో ఉండే అరణ్యంలోకి పంపేసి, కొత్తవాడి కోసం ఎదురు చూస్తారు.



అరణ్యానికి పంపబడ్డవాడు ఎలా బతుకుతాడో, ప్రజలకు ఏ మాత్రం పట్టదు.

ఈ విధంగా ఆ ద్వీపానికి యింత వరకూ ఇరవై ఇద్దరు రాజులయారు. వామాంగుడు ఇరవైమూడో రాజు.

వామాంగుడికి తనకు పట్టిన రాజయోగం గురించి సంతోషంకన్న, ఏడాది అయాక పట్టబోయే అరణ్యవాసం గురించి శ్రద్ధ ఎక్కువ కలిగింది. అతను కొందరు భటులను వెంటబెట్టుకుని అరణ్యానికి పోగోరాడు. ఈ ద్వీపానికి దగ్గిరలోనే మరొక ద్వీపం పైన ఆ అరణ్యం ఉన్నది. అక్కడికి పడవల్లో వెళ్ళాలి.

వామాంగుడు భటులు వెంటరాగా, పడవల్లో అరణ్యం చేరాడు. తరవాత, నాలుగురోజులు అక్కడేవుండి, అరణ్యాన్ని ఆ మూలాగ్రం జాగ్రత్తగా పరిశీలించాడు. అందులో మనుషులు జీవించటం కష్టం. అయితే అక్కడ మంచి కలపా, పంటలు పండించేందుకు కావలసినంత సారవంతమైన భూమీ ఉన్నది.

అడవి చెట్లన్ని కొట్టించి అక్కడ మంచి నగరం నిర్మించవచ్చు. పళ్ళ తోటలూ, పూల తోటలూ వేయవచ్చు.

వామాంగుడీ పనికి మనుషులను నియోగించాడు. అతని ఏలుబడి ఏడాది పూర్తి అయేలోగా అరణ్యం అందమైన నగరంగా మారిపోయింది.

నగరం చుట్టూ అందమైన తోటలు ఏర్పడ్డాయి. నగరం నిర్మించటానికి శ్రమించిన వారు ఈ కొత్త నగరంలోనే నివసించ గోరారు.

ఏడాది పూర్తి అయింది. వామాంగుడు కొత్త నగరానికి వచ్చేశాడు. అతనితోబాటు అనేకమంది పౌరులు, పాత నగరంవారు, కొత్త నగరానికి వలస వచ్చేశారు.

ఇది జరిగాక, పాత నగరం వారికి వామాంగుణ్ణి పోగొట్టుకోవటం ఇష్టం లేకపోయింది. అప్పటి కప్పుడే వారొక సభ చేసి, రెండు నగరాలకూ వామాంగుడే శాశ్వతంగా రాజుగా ఉండాలని తీర్మానించారు.





# మంచితనం

సదానందుడు మంచివాడు; తెలివైన వాడు. కాని, వాడికి ఇతర్లకు హానికలిగించకుండా, ఏదో మాటలతో ఆట పట్టించి వినోదించడం సరదా. రోజూ ఊరిబయట తన స్నేహితులతో కలిసి, వచ్చే పోయేవాళ్ళను పలకరించి, హాస్య సంభాషణ చేస్తూండే వాడు. ఇది చాలా మందికి బాధకలిగించి మొదట్లో చాలా గొడవలు వచ్చినా, క్రమంగా అందరూ వాడి అల్లరిని సహించి సర్దుకుపోవడం నేర్చుకున్నారు. ఇందుకు కారణం, సదానందుడికి ఆ ఊరు జమీందారు గారింట్లో పనిదొరకడం. జమీందారు గారి ఇంటి ఖర్చుల పద్దులు చూడడం, వాడి పని.

జమీందారుకు సదానందుడంటే, చాలా అభిమాన మేర్పడింది. ఈ విషయం ఊళ్ళో అందరికీ తెలుసు. అక్కడ పని దొరికి నప్పటి నుంచీ వాడి అల్లరి మరీ ఎక్కువైంది.

ఒక రోజు సదానందుడు తన స్నేహితులతో, ఊరి బయట చెరువు గట్టు మీద కూర్చున్నాడు. అప్పుడు వాడికి ఊరివైపు నడిచివస్తున్న ఒకమనిషి కనిపించాడు.

ఆయన నడివయసువాడు. బట్టలు బాగా దుమ్ముకొట్టుకు పోయివున్నవి. కాళ్ళకు చెప్పులు లేవు. చూడగానే పేదవాడనిపిస్తుంది.

సదానందుడు ఆయన్ని వెటకారంగా చూసి స్నేహితులతో, ''జమీందారు గారింటికి ఎవరో బంధువు వస్తున్నాడు, దారి చూపండి,'' అన్నాడు.

ఆ మనిషి వినయంగా సదానందుణ్ణి సమీపించి, ''బాబూ, నేను జమీందారు గారింటికే వెళుతున్నానని, నీ కెలా తెలుసు?'' అన్నాడు.

"వసుంధర".



సదానందుడు పెద్దగా నవ్వి, "అయ్యో, మల్లెపూవులాంటి మీ బట్టలు, ఖరీదైన పాదరక్షలు, ఇప్పుడే మీరు దిగిన విలువైన బండి, అన్నిటికన్న మీ ముఖంలోని గొప్ప తేజస్సు—చూడగానే ఎవరికైనా మీరు జమీందారుగారి బంధువులని తెలిసి పోతుంది," అన్నాడు.

"అవున్నాయనా! నేను బయల్దేరిన విలువైన బండికి సగం దారిలో చక్రం ఊడింది. బండిలోంచి కింద పడడంవల్ల, మల్లెపూవులాంటి బట్టలు మాసిపోయాయి. బండి తోలేవాణ్ణి వెనక్కు పంపించి, నే నిలావచ్చాను. వాడు వెళ్ళవలసిన దారి ముళ్ళదారి కావడంవల్ల, నా ఖరీదైన చెప్పులు వాడికిచ్చాను. నువ్వు, నాముఖం లోని తేజస్సు ఒక్కటే గుర్తుపడతావను కున్నాను. మొత్తం అన్ని గుర్తుపట్టావు," అన్నాడా మనిషి.

"అలాగా! అయితే, మిమ్మల్ని సరాసరి జమీందారుగారింటికి తీసుకు వెళ్ళేదా?" అన్నాడు సదానందుడు నవ్వాపుకుంటూ.

"ఈ వేషంలో ఆయన్ని చూడడం బావుండదు. ముందుగా నన్ను, వారి ధర్మసత్రంలో ప్రవేశపెట్టు. మా బండి వాడు వచ్చాక, ఈ దుస్తులు మార్చుకుని, ఆయన్ని చూస్తాను," అన్నాడా మనిషి.

బాటసారుల కోసం, ఆ ఊళ్ళో జమీం దారుగా రొక ధర్మసత్రం కట్టించాడు. అందులో అన్ని సదుపాయాలూవున్నప్ప టికీ, బాగా పేదవాళ్లు మాత్రమే అందులో బస చేస్తూంటారు. దేనికీ అక్కడ డబ్బు తీసుకోరు కాబట్టి, కలిగిన వాళ్ళకు అందులో బసచేయడం పరువు తక్కువ. అందులో బసచేసే పేదవాళ్ళు కూడా, దారిలో తమను దొంగలు దోచారనో, మరేదో కుంటిసాకులు చెప్పి సత్రంలో బస సంపాయిస్తారు.

ఈ మనిషి కూడా, అలాంటి పేద వాళ్ళల్లో ఒకడని, సదానందుడికి అని పించింది.

"మీబండివాడు ఎన్నాళ్లలో వస్తాడు?" అని అడిగాడు వాడు.

''ఏమో—చెప్ప లేను,'' అన్నాడా మనిషి.

''పోనీ, మా బండివాడి బట్టలిస్తాను. మార్చుకుంటారా?'' అన్నాడు సదానందుడు.

వాడి పక్కనవున్న కుర్రవాళ్ళందరూ నవ్వారు.

ఆ మనిషి కోపగించుకోకుండా, ''అయితే, మీ ఇంటికి వస్తాను, బట్టలిప్పిస్తావా?'' అన్నాడు.

ఈ ప్రశ్నవింటూనే, యితనెవరో ముష్టివాడై వుంటాడనుకుని, సదానందుడు, ''మీరు బండివాడి బట్టలేసుకుంటే, జమీందారుగారు మీకు దర్శనం యివ్వరు,'' అన్నాడు.

''ఆయన చూసేది, నా బట్టల్నికాదు; నన్ను! మేమిద్దరం ప్రాణస్నేహితులం,'' అన్నాడా మనిషి.

''అయితే, యిలాగే వెళ్ళి, ఆయన్ని కలుసుకోవచ్చు గదా!'' అంటూ నవ్వాడు సదానందుడు.

''చూడు బాబూ, మనిషి ప్రతివిషయంలోనూ, కొన్ని మర్యాదలు పాటించాలి. దేవుడి ఆలయంలోకి వెళ్ళాలంటే శుచిగా స్నానం చేసి, పాదరక్షలు బయట విడిచి వెళ్ళాలి. అలాగే, ఎంత స్నేహితులైనా, గొప్ప వాళ్ళింటికి వెళ్ళేటప్పుడు, కనీసం ఉతికిన బట్టలు ధరించాలి. సరే, ముందు





నాకు సత్రానికి దారిచూపించు,'' అన్నాడా మనిషి.

''సత్రం వ్యవహారాలన్నీ, నేనే చూసుకుంటున్నాను. అయినా అందులో చేరడానికి, మా జమీందారుగారు కొన్ని ముఖ్యమైన షరతులు పెట్టారు,'' అన్నాడు సదానందుడు.

''ఏమిటా షరతులు?'' అని అడిగాడా మనిషి.

''ముందు ఇరవై గుంజీళ్ళు తియ్యాలి. తర్వాత రెండు పాటలు పాడాలి. అటు తరవాత, ఆ కనబడే చెట్టుచుట్టూ వంద సార్లు పరిగెత్తాలి,'' అన్నాడు సదానందుడు వచ్చే నవ్వు ఆపుకుంటూ.

ఆ మనిషి కొంచెం సేపు ఆలోచిస్తూ ఊరుకుని, ''నువ్వు సరదాకు నన్ను ఆటపట్టించాలని యిలా అంటున్నావా లేక జమీందారుగారు నిజంగానే, బస కోరే వాళ్ళకు యిలాంటి షరతులు పెట్టారా ?'' అన్నాడు.

''నేను అబద్ధం చెప్పను,'' అని సదానందుడు అంటూండగా, అనుకోకుండా జమీందారు అటుగా వచ్చి, ఆ మనిషిని చూసి, ''అరె! నువ్వు రత్నాకరుడివి కదూ ?'' అన్నాడు.

''అవును రా !'' అంటూ ఆ మనిషి తనబండి చెడినవైనం చెప్పి, ''ముందుగా సత్రంలో బసచేసి వేషంమార్చి, అప్పుడు మీ యింటికి వద్దామనుకుంటున్నాను. ఈలోగా, నువ్వే వచ్చావు,'' అన్నాడు.

ఆ మనిషిని జమీందారు గుర్తుపట్టడమూ, జమీందారును ఆ మనిషి ఏరా అనడమూ చూసి, సదానందుడు భయంతో గజ గజ వణికిపోయాడు. వాడికి రత్నాకరుడితో మళ్ళీ మాట్లాడే అవకాశం లేకుండా జమీందారు, ''మా ఊరొచ్చి సత్రంలో బస చేస్తావా ? మంచి వాడివే, పద పద !'' అని, తనతో ఇంటికి తీసుకుపోయాడు.

భయం కొద్దీ మర్నాడు సదానందుడు, జమీందారింటికి వెళ్ళలేదు. ఆరోగ్యం

బాగాలేదని కబురు పంపాడు. అయితే, కొద్ది సేపటికి రత్నాకరుడే, సదానందుడి ఇంటికి వచ్చాడు.

ఆయన్ను చూస్తూనే వాడు నిలువెల్లా వణికిపోతూ, "అయ్యా, నన్ను క్షమించండి!" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

"క్షమించడం దేనికి!" అని రత్నాకరుడు ఒకక్షణం ఆగి, "ఎవరైనా పేదవారు సత్రంలో చేరడానికి వస్తే, విధిగా నువ్వు చెప్పిన షరతులు పాటించవలసి వుంటుందా? ఈ విషయంలో నిజం చెప్పు! సత్రంలో బసకోసం వచ్చేవాళ్ళలో వృద్ధులూ, బలహీనులూ, వికలాంగులూ వుండవచ్చు. అమానుషంగా వున్న, యీ షరతుల్ని జమీందారుకు చెప్పి తొలగించేలా చేయగలను," అన్నాడు.

సదానందుడు, ఆ మాటలతో తేరుకుని ఆశ్చర్యంగా, "జమీందారుగారు మీకు చాలా దగ్గరవారుగదా! యీ విషయం నన్నే అడిగి ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నారు?" అన్నాడు.

ఆ ప్రశ్నకు రత్నాకరుడు నవ్వి, "నన్ను ఆటపట్టించి వినోదించేందుకు, నువ్వు అబద్ధం చెప్పావని, నా నమ్మకం. నువ్వు చెప్పింది అబద్ధమే అనుకుందాం. అప్పుడు, నేనీవిషయం జమీందారు నడిగితే, ఆయన నీ మీద కోపం కొద్దీ ఉద్యోగంలోనుంచి తొలగించడమేకాక, నిన్ను కఠినంగా శిక్షిస్తాడు. అలా జరగడం నా కిష్టంలేదు. నువ్వు చెప్పింది అబద్ధమైతే—అది నీనుంచి తెలుసుకోవడమే, నీకు క్షేమం," అన్నాడు.

రత్నాకరుడి మంచితనం, సదానందుడికి అర్థమైంది. ఆయనకూ, తనకూ ఏ మాత్రం పరిచయం లేకపోయినా, అకారణంగా తనాయనను అపహాస్యం చేశాడు. అయినప్పటికీ ఆయన తనకు జమీందారు నుంచి అపకారం జరక్కూడదనుకుంటున్నాడు.

సదానందుడు తన తప్పు ఒప్పుకోవడమే గాక, ఆ తరవాత వినోదం కోసం ఇతరులనెవరినీ ఆటలుపట్టించలేదు.





# దివాను పరీక్ష

వీరవరం జమీందారుకు గుర్రపుస్వారీ, వేటా, మల్లవిద్యలంటే చాలా సరదా. ఆయన తన జమీగ్రామాల్లో సాముగరిడీ, వ్యాయామశాలల్లాంటివి చాలా నెలకొల్పాడు. కాని, ఎక్కడా దివాణం ఖర్చుతో పాఠశాలలంటూ మాత్రం లేవు.

ఒకసారి ఆయన పొరుగున వున్న గోపవరం జమీందారును చూడబోయి, ఆయనతోపాటు చాలా గ్రామాలు తిరిగి వచ్చాడు. ఆయా గ్రామాల్లో వున్న పాఠశాలలూ, పిల్లల చదువుపట్ల గోపవరం జమీందారు కనబరుస్తున్న శ్రద్ధా వీరవరం జమీందారును బాగా ఆకర్షించాయి.

ఆయన దివాణానికి తిరిగివస్తూనే, దివానును పిలిచి, ''మనం కూడా గ్రామ గ్రామానా గోపవరం జమీందారుగారిలా పిల్లల చదువుకోసం పాఠశాలలు ఏర్పాటు చేయవలసిన అవసరం వున్నది. ఈ విషయంలో ఖర్చుకు వెరవకూడదు. వెంటనే పాఠశాలలు స్థాపించి, ఉపాధ్యాయులను నియమించండి,'' అని చెప్పాడు.

దివానుకు డబ్బు ఖర్చంటే బెదురు. పైగా, ఆయనా జమీందారు లాగే వేటా, మల్లవిద్యలంటే ఆసక్తికలవాడు. అయినా, జమీందారు ఆజ్ఞ కనక ప్రతిగ్రామానా ఒక పాఠశాల పెడుతున్నట్టు ఉత్తరువు జారీచేశాడు. అయితే, ఉపాధ్యాయుల నియామకం సమస్య ఎదురయ్యింది.

దివాను ఈ విషయం జమీందారుతో చర్చించి, ఇప్పుడు వ్యాయామశాలలకు అధిపతులుగా వున్నవాళ్ళు పగలు పిల్లలకు విద్యాబోధ చెయ్యాలనీ, సూర్యాస్తమయం అయ్యాక వ్యాయామశాలలు నడపాలనీ కబురు పంపాడు.

ఈ విధంగా వీరవరం జమీలోని ప్రతి గ్రామానా ఒక పాఠశాల ఏర్పడింది.

గార్ల సరస్వతి

సంవత్సరం గడిచాక, అవి ఎలా నడుస్తున్నవో చూసి తెలుసుకునేందుకు దివాను బయలుదేరాడు.

ఆయన ముందుగా ఊడలమర్రి అనే గ్రామం చేరి, అక్కడ పాఠశాలకు వెళ్ళాడు. ఆ సమయంలో చాలామంది పిల్లలతోపాటు, ఉపాధ్యాయుడు కూడా కునికిపాట్లు పడుతున్నాడు. కొందరు పిల్లలు ఏవో ఆటలాడుతూ గోలచేస్తున్నారు.

ఇది చూసిన దివానుకు ఒళ్ళు మండి పోయింది. ఆయన కునికిపాట్లు పడుతున్న ఒక కుర్రవాణ్ణి లేపి, కళ్ళెర్ర చేస్తూ, "ఇదా, యిక్కడ మీరు చదువుతున్న తీరు! ఇంతవరకూ మీకేపాటి చదువు అబ్బిందో చూస్తాను," అని, కుర్రవాణ్ణి, "ఒరే, రామాయణం, భారతం రాసిందెవరు?" అని ప్రశ్నించాడు.

కుర్రవాడు గజగజ వణికిపోతూ, "కొట్టకండి! అవి రాసింది, నేను కాదు," అన్నాడు.

ఆ జవాబుకు మండిపడి దివాను గబగబా పోయి, ఒక ఉపాధ్యాయుణ్ణి భుజం తట్టి లేపి, "ఇదా, నువ్వు పిల్లలకు చదువు నేర్పుతున్న పద్ధతి! నీ విద్యార్థి నొకణ్ణి, రామాయణం, భారతం ఎవరు రాశారని అడిగితే, నేను కాదంటాడేమిటి?" అన్నాడు.



ఉపాధ్యాయుడు దివానును చూస్తూనే, రెండు చేతులూ ఎత్తి నమస్కరిస్తూ, "అయ్యా, క్షమించండి! వాడు నిద్ర మత్తులో అలా జవాబిచ్చి వుంటాడు. నా నమ్మకం ఏమంటే, వాటిని వాడే రాసి వుంటాడని," అన్నాడు.

ఈ సమాధానంతో దివాను మరింత కోపం తెచ్చుకుని, చరచరా ప్రధానోపాధ్యాయుడున్న గదికి పోయి, సంగతి చెప్పి, "పాఠశాల యింత అధ్వాన్నంగా నడుస్తున్నదని నేననుకోలేదు. ఇందుకు, మీ సంజాయిషీ ఏమిటి?" అని అడిగాడు.

ప్రధానోపాధ్యాయుడు బెంబేలు పడిపోతూ, "తమరు మరోలా భావించకండి.

ఈ పల్లె ప్రజలున్నారే, పరమ అమాయకులు. పిల్లలకు పాఠాలు చెప్పేప్పుడు అవసరం కొద్దీ గట్టిగా కోప్పడితే, వాళ్ళను బడికి పంపరు. మరొకటి, మీరడిగిన అంత కఠినమైన ప్రశ్నకు పసివెధవలు ఏం సమాధానం చెప్పగలరు? మనలో మాటగా సెలవివ్వండి! ఆ రామాయణ, భారతాలు తమరు రాసినవికాదు గదా?'' అని అడిగాడు.

దివాను మండిపడుతూ అప్పటికప్పుడే బయలుదేరి దివాణానికి వచ్చేశాడు. మర్నాడు ఆయన జమీందారును కలుసుకుని, ''సంవత్సరం కిందట మనం ప్రారంభించిన పాఠశాలల్లో, పిల్లల చదువులు ఎలా సాగుతున్నవో తెలుసుకునేందుకు ఊడలమర్రి అనే గ్రామం వెళ్ళాను. అక్కడి పాఠశాల పరిస్థితి ఏమీ బాగా లేదు. ఉపాధ్యాయులతోపాటు ప్రధానోపాధ్యాయుడికీ పెద్ద తేడా వున్నట్టు కనిపించడం లేదు. రామాయణం, భారతం ఎవరు రాశారని ప్రశ్నిస్తే, ఒక్కరూ సరైన సమాధానం చెప్పలేకపోయారు. రాముడు రామాయణం రాశాడనీ, భరతుడు భారతం రాశాడనీ— వాళ్ళల్లో ఏ ఒక్కరికీ తెలియకపోవడం ఆశ్చర్యమే కాదు, చాలా విచారం కలిగిస్తున్నది,'' అన్నాడు.

జమీందారు దివానుపట్ల ఎంతో సానుభూతి కనబరుస్తూ, ''మీరు జమీ గ్రామాల్లోని అన్ని పాఠశాలలనూ ఒకసారి తనిఖీచేసి, ఉన్న లోపాలను సరిదిద్దడం అవసరం. ఇందుకు ఇద్దరిని మీకు సహాయంగా పంపుతాను. వేటకుక్కల పోషణ చూసే భైరవయ్యా, అశ్వశాలను ఎంతో సమర్థంగా నడుపుతున్న వీరభద్రుడూ, మీ వెంట వచ్చి - విద్యార్థులనూ, ఉపాధ్యాయులనూ మీతోపాటు తగు ప్రశ్నలు వేసి పరీక్షిస్తారు. ఇందుకుగాను, లక్ష రూపాయిలు మంజూరు చేస్తున్నాను,'' అన్నాడు.

దివాను సరేనన్నట్టు తృప్తిగా తల వూపాడు.






అహింసను, శాంతియుత జీవనాన్ని, కుల వర్గ రహితమైన సంఘాన్ని ప్రబోధించే బౌద్ధధర్మం మహావృక్షం లాగ సర్వత్రా వ్యాపిస్తున్నది.

జీవకోటిని ఉద్ధరించే కరుణామూర్తిగా వచ్చిన 'తథాగతుడు' అని, 'బోధిసత్వుడు' అని భగవానుడుగా కీర్తింపబడుతున్న బుద్ధుడి ఔన్నత్యం హిమాలయం లాగ పెరిగింది. బుద్ధుడి ఆజన్మ వైరి దేవదత్తుడి అసూయా ద్వేషాలు మరింత పెరిగాయి.

బుద్ధుడు వృద్ధాప్యంలో కూడా దీక్షతో వాడవాడలా తిరుగుతూ సమాజంలో హీనకులాల వాళ్ళని, నిర్భాగ్యులను, అగ్రవర్ణాలవారి చేత అక్రమాలకు, అవమానాలకు గురి అవుతున్న దళితులను తన ప్రబోధంతో సంస్కారవంతుల్నిగా చేస్తూ ప్రియశిష్యులుగా చేసుకుంటున్నాడు. ఇది కక్షసాధించడానికి దేవదత్తుడికి మంచి అదనుగా కనిపించింది.

బుద్ధుడికి ప్రతికూలంగా ఉన్నవారినందరినీ కూడగట్టుకొని ఎన్నో ప్రతిఘటనలు చేశాడు. తంత్రాలు పన్నాడు.

దేవదత్తుడు బుద్ధుడిని ఎదుర్కొని, ''అహింసను బోధించావు, బాగానే ఉంది కాని, బౌద్ధభిక్షువులు మాంసాహారాన్ని ముట్టరాదనీ, బౌద్ధధర్మాన్ని స్వీకరించి నీ శిష్యులైనవారు, ఆహారనియమం పాటించాలనీ ఎందుకు కట్టడి చెయ్యలేదు?'' అన్నాడు.



బుద్ధుడు, "నాయనా, దేవదత్తా! బౌద్ధ ధర్మావలంబకులు అహింసను అవలంబించాలని చెప్పనే చెప్పాను. పేదరికం చేత చాలామంది ఏది దొరికితే అది తిని, మాంసాహారులుగానే ఉండవలసి వస్తున్నది. ధనికవర్గానికి లభించే మంచి బలకరమైన శాకాహారాలు పేదప్రజానీకానికి అందుబాటులో ఉండవు కదా! మానవ సేవాధర్మాన్ని నిర్వర్తించడమే ప్రధానమైన బౌద్ధభిక్షువులు, ప్రాణ పోషణకు మాత్రమే ఆహారం తీసుకొనక తప్పదు. వారు తిండి అడుక్కుంటారు. వారికి కబళం వేసేవారు మాంసాహారులు కారాదనీ, శాకాహారులు మాత్రమే అయి ఉండాలనీ శాసించే అధికారం నాకు లేదు. మాంసాహారులనీ, శాకాహారులనీ విడదీసి భిక్షకు వెళ్ళడం కులవర్గాలకు అతీతమైన సర్వసమతను కోరే బౌద్ధ ధర్మానికి విరుద్ధమైనది. బౌద్ధభిక్షువులు వివక్షతకు దారి తీయకుండా ఉండాలని కోరుతున్నాను. భిక్షకు వెళ్ళినవాడు ఎవరేది పెట్టినా స్వీకరించక తప్పదు!" అన్నాడు.

"భిక్షకు వెళ్ళినవాడు ఎవరేది పెడితే అది తినాల్సిందే అంటావు! ఔనా?" అని నిలదీశాడు దేవదత్తుడు.

బుద్ధుడు చిరునవ్వుతో, "ఎవరు ఎటువంటి ఆహారంతో జీవనం గడుపుతున్నారో దాన్నే కబళం పెట్టినప్పుడు కులవర్గ భేదాలు లేని భిక్షువు దాన్ని తినడం భిక్షుక ధర్మమే కదా మరి!" అన్నాడు.

బుద్ధుడి మాటలకు దేవదత్తుడు తల పంకిస్తూ వెళ్ళాడు.

"బుద్ధుడు అంతమొందాలి! లేకుంటే వృద్ధాప్యాన్నీ, అరోగ్యాన్నీ లెక్క చేయకుండా యింకా ప్రబోధం సాగిస్తూనే ఉంటాడు. హీనజాతుల వారి నందర్నీ జ్ఞానవంతులుగా చేస్తూ, బౌద్ధులుగా చేర్చుకుంటూనే ఉంటాడు. అణిగిమణిగి ఉండవలసిన దళితులు తెలివి మీరితే, అగ్రవర్ణాలకు పుట్టగతులుండవు; చాకిరీ

చేసేవారుండరు! అంచేత బుద్ధుడు లేకుండా చెయ్యాలి!" అని అనుకుంటూ దేవదత్తుడు జీవకుడి దగ్గిరికి వెళ్ళాడు.




జీవకుడు హీనకులానికి చెందిన బుద్ధుని శిష్యుడు. బౌద్ధధర్మంపట్ల అమిత విశ్వాసంతో బుద్ధుణ్ణి దేవుడుగా భావిస్తూ వున్నాడు.

దేవదత్తుడు జీవకుణ్ణి ప్రలోభ పెట్టి, మాయ మాటలతో చేరదీసుకున్నాడు.

"బుద్ధుడు చెప్పేవన్నీ వొట్టికబుర్లు. మీ వర్గాన్ని తన వలలో వేసుకోడానికి అంతా సమానులే అంటున్నాడు గాని మీలాగే జీవించగలడా? మీరు తింటున్నదే తినగలడా?" అంటూ జీవకుడి మనసు విరిచి విషబీజాన్ని నాటాడు. బుద్ధుడిని భిక్షకు ఆహ్వానించి చూడమని బాగా నూరిపోశాడు.

జీవకుడు వెళ్ళి బుద్ధుడిని తన ఇంటికి భిక్షకు వచ్చి తన ఆతిథ్యాన్ని స్వీకరించ వలసిందిగా కోరాడు. బుద్ధుడు జీవకుడి వెంట వెళ్ళాడు. దేవదత్తుడు ప్రచ్ఛన్నంగా కనిపెడుతున్నాడు.

జీవకుడు పిల్చుకొచ్చాడే గాని, తిన డానికి వచ్చిన బుద్ధుడికి కబళం పెట్ట డానికి తటపటాయిస్తూంటే బుద్ధుడు, "నాయనా, జీవకా, ప్రత్యేకంగా నాకోసం ఏమీ సిద్ధపరిచి ఉంచలేదని సందేహించకు; నువ్వు తినేదే నాకు యింత పెట్టు. నీభిక్షను నమ్ముకుని వచ్చాను!" అన్నాడు.

జీవకుడు బుద్ధుడికి వణుకుతున్న చేతులతో కబళం పెట్టాడు. బుద్ధుడు దాన్ని తృప్తిగా తిన్నాడు.

అప్పటికే బుద్ధుడి ఆరోగ్యం సరిలేదు. వృద్ధాప్యం ముదిరి జీర్ణశక్తి తగ్గి వున్నది. జీవకుడు పెట్టిన భిక్ష మాంసంతో తయారైనది. అది కూడా అంతమంచిది కాదు.

బుద్ధుడు జీవకుణ్ణి ఆశీర్వదించి వెళ్ళాడు. జీవకుడిలో పాపభీతి మొదలైంది. ముఖం దోషికిమల్లే ముడుచుకుపోతున్నది. చాటుగా కనిపెడుతున్న దేవదత్తుడు, బుద్ధుని సత్యవర్తనకు విస్తు



దగ్గిర మోకరిల్లి మన్నించమని వేడుకొంటు న్నట్లు వెర్రిచూపులు చూస్తున్నారు.

బుద్ధుడు వారి రాకను గ్రహించి కనులు తెరిచి ప్రీతిగా చూసి, ఇద్దర్నీ దగ్గిరికి చేరపిల్చి, "మీరు చింతించవలసిందేమీ లేదు; ఏదో ఒక విధంగా మరణం తప్ప రానిదే కదా! నేను నిర్వాణాన్ని చేరుకో డానికి సాయపడ్డారు. కృతజ్ఞుణ్ణి! నిర్వా ణము చర్మచక్షువులకి కనిపించని వెలుగు. జ్యోతి అరిపోతున్నప్పుడు వెలుగు ఎక్క డికి వెళుతున్నదో ఆ నిర్వాణ పథాన్ని చేరుతున్నాను," అన్నాడు.

దేవదత్తుడిలో గొప్ప పరివర్తన కలి గింది. బుద్ధుని పాదాలు తాకడానికి అనుజ్ఞ కోరాడు. బుద్ధుడు అతణ్ణి చేరబిల్చి భుజం మీద చేయివేసి, "నాయనా, దేవదత్తా! బుద్ధిని మానవ శ్రేయస్సుకి వినియోగించి శ్రమించినవాడే బుద్ధుడు; ఆ బుద్ధుడికి చావులేదు! మానవుల కోసం అవతరించే మహాత్ములందరూ బుద్ధులే! జ్ఞాతివైరంతో వ్యక్తిగతంగా నన్ను ద్వేషించావే గాని ధర్మాన్ని ద్వేషించలేవు! నీ ద్వేషాన్ని నాతోనే సరిపుచ్చి, నేను వెళ్తున్నాను గనుక నువ్వే నా స్థానంలో ఉన్నావనుకో! మన సోదరులు ఆనందుడు, నందుడు మొదలైన వారంతా రాజభోగాల్ని వదలి బౌద్ధ భిక్షువులై మానవ సేవకు అంకిత

పోతూనే, తలపెట్టిన ద్రోహానికి నొచ్చు కోవడం మొదలైంది.

సరిపడని ఆహారం విషతుల్యమై బుద్ధు డిని రోగగ్రస్తుణ్ణి జేసింది. రోజు రోజుకీ క్షీణించి పోతున్న బుద్ధుడు అవసాన దశకు వచ్చాడు.

బుద్ధుడు శయనించి ఉన్న వేదిక చుట్టూరా ప్రధానశిష్యులు తలలు వంచి మౌనంగా విచారంలో మునిగి ఉన్నారు. పరిసరమంతా స్తంభించి నిశ్శబ్దంగా ఉన్నది. అప్పుడు అక్కడికి దోషులుగా తలలు వాల్చుకొని తడబడే నడకతో జీవకుడు, దేవదత్తుడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ వచ్చి బుద్ధుని పాదాల



మయ్యారు. నన్నే అనుసరించి నువ్వూ అలాగే బౌద్ధ ధర్మాన్ని అనువర్తించి వ్యాప్తి చెయ్యి. బౌద్ధ సంఘారామాల్ని, బౌద్ధబిక్షువులను తీర్చిదిద్ది సక్రమమార్గాన నడిపించు! అందుకు నీవు సమర్థుడివి!'' అంటూ దేవదత్తుడి తలపై చేతి నుంచి, ఆశీర్వదిస్తూ అర్థిస్తున్నట్లుగా చెప్పాడు.

దేవదత్తుడు పులకాంకితుడై మేను మరిచి కన్నులు మూసి, 'బుద్ధంశరణం గచ్ఛామి; ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అని మూడు సార్లు జపించి, ''హే బుద్ధభగవానుడా! మానవుడే దేవుడుగా మారే దారి చూపి, వేరే భగవంతుడి గురించిన ఆలోచనకు తావులేని ఉన్నత ధర్మాన్ని బోధించిన నువ్వే భగవానుడివి!'' అన్నాడు. చేతులెత్తి మ్రొక్కాడు.

అనాడు కూడా వైశాఖ పూర్ణిమ. నిండు చంద్రుడు తూర్పున ప్రకాశిస్తున్నాడు. ప్రపంచపు తూర్పున ఉదయించిన ప్రాగ్జ్యోతిగా కీర్తింపబడిన బుద్ధ భగవానుడు నిర్వాణం పొందాడు. పూర్ణ చంద్రబింబం మరింత తేజోవంతంగా ఆకాశమధ్యాన ప్రకాశిస్తూ వెన్నెల వెదజల్లుతున్నది.

బుద్ధుని అనంతరం బుద్ధుడు ప్రబోధించిన ధర్మాలు, సూత్రాలు బౌద్ధమతంగా రూపొందినై. బుద్ధుడు దేవుడిగా ఆరాధింపబడ్డాడు,అవతారమూర్తిగాగుర్తించబడ్డాడు.

సూతుడు బుద్ధావతారం ముగించి, దశావతారాల్లో చివరిదైన పదియవ అవతారం కల్క్యవతారం గురించి చెప్పనారంభించాడు:

కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిసి ఒక మహాయుగం.

ప్రతి మహాయుగం అంతంలో, కలియుగం చివరిదశలో కలి ప్రభావం తారాస్థాయి నందుకున్నప్పుడు లోకం గొప్ప సంక్షోభంలో పడుతుంది.

'దేవుడనేవాడున్నాడా?' అని ఒకవంక అనిపిస్తూ ఉంటే వేరొకవంక 'మనుమ



లనేవారున్నారా?' అని అనిపిస్తున్న సమయం అది.

ఏకత్వం నుంచి భిన్నత్వంలో మానవ సంఘం ఛిన్నాభిన్నమై వర్గాలు, వర్గకలహాలు, జాతులు, జాతివైషమ్యాలు, దౌర్జన్యం, దురధికారం, హింస పెచ్చు పెరిగిపోయి మంచివాళ్ళకి నిలువ నీడ లేకుండా పోతుంది.

పాలకులు రాక్షసులెంతో మంచివాళ్ళు అనిపిస్తున్నారు. ఒకర్నొకరు అన్నివిధాలా దోచుకోవడమే జీవనపరమార్థంగా, మనుషులు క్రూరమృగాలను మించి పోతున్నారు. మత దురహంకారులు పిశాచాలై పోతున్నారు.

మేధావుల మేధస్సు విధ్వంసానికి దోహదం చేస్తున్నది. కోట్లానుకోట్ల జనులు ఒక్కసారిగా నిర్మూలమయ్యే సాధనాలు వచ్చాయి. భూతలం మలమల మాడిపోగల పరిణామాలు వచ్చాయి. అందువల్ల గ్రహాలు వక్రంగా తిరగసాగాయి. ప్రకృతి ధర్మాలన్నీ అస్తవ్యస్తంగా తయారైనాయి. భూమాత విలపిస్తున్నది!

అటువంటి సంకటస్థితిలో దండనీతి తప్ప వేరే మార్గం లేదని విష్ణువు దుర్మార్గుల్ని నరికి సన్మార్గులకు వసతి కల్గించడానికి కల్కిమూర్తిగా అవతరిస్తాడు. అదే కల్క్యవతార అవతరణం.

శివుడు తన అంశతో గొప్ప తెల్లని గుర్రాన్ని కల్పించి కల్కిమూర్తికి యిస్తాడు. ఆ మహాశ్వం కాలగమనాన్ని మించిన వేగంతో తెల్లని ధూమాన్ని నిశ్వాసంగా విడుస్తూ ధూమకేతువులా ఆకాశ గమనం చేయగల్గుతూ గ్రహాంతరాలకు దౌడు తీయగల్గుతుంది.

ఆ గుర్రం మీద కల్కిమూర్తి అధిరోహించి, ఆకాశాన్ని అంటే పెద్ద కత్తిని ధరించి దుష్టశక్తుల్ని హతమార్చడానికి బయలుదేరుతాడు. ప్రళయ మేఘాలలోని విద్యుత్తుతో తయారైన అతని కత్తి మెరుపులాగ నింగి నుండి నేలకు జారుతూ దుష్టఖండనం చేస్తుంది.

కల్క్యవతారమూర్తి యోధునివలె ధగధగలాడే కవచాన్ని ఆపాదమస్తకం ధరించి మంచివాళ్ళకు దివ్యసుందర మూర్తిగానూ, దుర్జనులకు మహాభయంకరమూర్తిగానూ కనిపిస్తాడు.

విష్ణువు యెత్తిన కల్క్యవతారం దేశభేదాల్నిబట్టి అనేక దేశాల్లో అనేక విధాలైన రూపభేదాలతో స్వారిసాగిస్తూ అవతరించిన పనిని నెరవేరుస్తాడు.

కల్కిమూర్తి ధాటికి కలిప్రభావం నులుచుకుపోతూ పారిపోతూంటే, తన దీర్ఘనిశిత కరవాలంతో తరుముతూ లోకంలోని దుర్మార్గుల్నీ, ఘాతుకవర్గాలనూ, లోకసంక్షోభకారులైన పాలకులనూ, వర్గాలనూ అంతమొందిస్తూ సజ్జనులకు రక్షణ కల్పిస్తాడు.

కల్కి అవతరణంతో కొత్త మహాయుగానికి నాంది జరుగుతుంది. గ్రహగతులు సక్రమమార్గాలుపడతాయి.

భూదేవి కల్కి అవతారుడైన విష్ణుదేవుడికి నివాళిపట్టి అనేక విధాలుగా స్తుతి చేస్తూండగా బ్రహ్మాదిదేవతలు, సప్తర్షులు పూలజల్లు కురిపిస్తూ కీర్తిస్తుంటారు. నారదుడు మహతిపై సామగానాన్ని వినిపిస్తుంటాడు.

భూమ్మీద నిరంకుశ రాజ్యపాలనలు, దౌర్జన్యము, అధర్మము నశించి శాంతి నెలకొల్పే కల్కిమూర్తి మానవకోటిని భిన్నత్వం నుంచి ఏకత్వానికి, శాంతియుతమైన సహజీవనానికి మళ్ళిస్తాడు. కృతయుగం మొగ్గతొడిగి మరొక మహాయుగం ప్రారంభమౌతుంది. కల్కిరూపాన్ని ఉపసంహరించుకొని విష్ణువు అంతటా వ్యాపించి విశ్వస్థితికి మూలమై నిలుస్తాడు.

విష్ణువు అనగా వ్యాపించేవాడు అని నిర్వచనం. సర్వవ్యాపకుడైన విష్ణువు పరిణామస్వరూపుడు. కాలమే అతని ఉనికి. ఈ మహావిశ్వమే అతని పరిపూర్ణ స్వరూపం—అని చెప్తూ సూతమహర్షి దశావతారాలు ప్రధానంగా గల విష్ణు కథను సమగ్రసంపూర్ణం చేశాడు.

—(సమాప్తం)



# చివరికోరిక

పెళ్ళామూ, బిడ్డలూ ఎవరూ లేని జోగయ్యా అనే ధనికుడు దీర్ఘవ్యాధితో మంచానపడ్డాడు. ఆయన ఆస్తికి వారసుడు కాబోయే మంగపతి మాత్రం, ఆయన మంచానికి ముప్పొద్దులా కాపలా కాస్తున్నాడు.

జోగయ్యకు వైద్యం చేస్తున్న వరదాచారి వచ్చి, రోగిని బాగా పరీక్షించి, మంగపతిని పక్కకు పిలిచి, "మీ మామ పరిస్థితేమీ బాగా లేదు. మనిషి స్పృహలో వున్నాడని కూడా అనుకోను. ఒకవేళ ఆయనలో ఏమాత్రమైనా కదలిక కనబడితే, కష్టపడి ఎలాగో, యీ మాత్రలు రెండూ మింగించు. ఫలితం దక్కినా దక్కవచ్చు," అన్నాడు.

వైద్యుడు అటు వెళ్లగానే జోగయ్యా కళ్ళు తెరిచి, మంగపతిని దగ్గిరకు పిలిచి, ఆస్తి పాస్తులు సంపాయించడం ఎంతకష్టమో, వాటిని నిలబెట్టుకోవడం కూడా అంత కష్టమేనంటూ—హీనస్వరంతో ఏవేవో చెప్పసాగాడు.

మంగపతి అతి విచారంగా ముఖం పెట్టి, "అవన్నీ యిప్పుడెళ్ళదుకు మామయ్యా? నీకేమైనా తీరని కోరిక వుంటే చెప్పు. ఇప్పుడు నువ్వున్న పరిస్థితిలో, అలాంటి కోరిక ఏమైనా వుంటే, దాన్ని తీర్చడం నా బాధ్యత," అన్నాడు.

జోగయ్యా ఒక క్షణం ఆగి, "ఆ వరదాచారిగారు రెండు మాత్రలు యిచ్చి వెళ్లాడు గదా. వాటిని నువ్వీ పరిస్థితిలో నా నోట్లోవేసి చూడడంకన్న, నేను కోరుకునేదేముంటుంది!" అన్నాడు.

మంగపతికి నోట మాట రాలేదు.

—కమలిని





# డబ్బు మూట

ఒకానొక గ్రామంలో అబ్దుల్ రసూల్ అనే కుర్రవాడుండే వాడు. వాడు తల్లిదండ్రులకు ఒకడే కొడుకు. వాళ్ళు చాలా పేదవాళ్ళు. తండ్రి కాయకష్టం చేసి కుటుంబాన్ని పోషిస్తూండే వాడు.

రసూల్‌కు పదహారేళ్ళ వయసులో, ముందు తల్లీ, తరవాత తండ్రీ, ఆరు నెలలు తిరక్కుండానే ఒకరి తరవాత ఒకరు చనిపోయారు.

తల్లిదండ్రులు పోయాక రసూల్‌కు, ఆ గ్రామంలో వుండ బుద్ధికాలేదు. ఎంత కష్టపడి పని చేసినా, వచ్చేకూలి డబ్బులు, ఆరోజుకు చాలీ చాలనితిండికి సరిపోతూండేవి. అక్కడికి దూరానవున్న ఒక పట్టణంలో, బాగా శ్రమపడి పని చేసే వాళ్ళకు మంచికూలీ డబ్బు దొరుకుతుందని వాడు విన్నాడు. వాడు సాహసించి గ్రామం వదిలి పట్టణం చేరాడు.

పట్టణంలో రసూల్, ఒక పెద్ద వర్తకుడి దగ్గిర పనికి కుదిరాడు. ఆ వర్తకుడికి పట్టణంలోని వివిధ ప్రాంతాల్లో చాలా దుకాణాలున్నవి. రసూల్ పని ఏమంటే రోజూ అవసరమైన వస్తువులను ఒక దుకాణం నుంచి మరొక దుకాణానికి చేరవేయడం.

ఈ పనిలో వాడు పదేళ్ళు కష్టించి కొంత డబ్బుకూడ పెట్టాడు. ఈ కాలంలో రసూల్ తన తిండీ, బట్టల విషయంలో కూడా ఎంతో పొదుపుగావుంటూ, సెలవు దినాల్లో కూడా ఏదో వినోదాలకంటూ డబ్బు ఖర్చు పెట్టక, అతి సాధారణంగా బతికాడు.

నెల నెలా వాడు యజమాని యిచ్చే జీతంలో మిగిల్చిన ధనాన్ని, ఒక ఖాజీ దగ్గిర దాచుకునే వాడు. పదేళ్ళకాలంలో, ఆ విధంగా పెద్ద మొత్తమే పోగయింది.

అరేబియా కథ

దానితో వాడికి ఒక ఆలోచన వచ్చింది. తను పట్టణంవదలి స్వగ్రామం చేరి, ఏదైనా చిన్న వర్తకం ఎందుకు ప్రారంభించ కూడదు ?

ఈ ఆలోచన గురించి రసూల్ ఖాజీకి చెప్పాడు. ఖాజీ వాడికి మేలుకలగాలని దీవించి, తన దగ్గిర రసూల్ దాచుకున్న డబ్బంతా యిచ్చేశాడు.

రసూల్ ఆ డబ్బు మూట గట్టుకుని, ఒక సూర్యోదయం వేళ తన గ్రామానికి బయలుదేరాడు. వాడు మధ్యాహ్నం వరకూ ఓపిగ్గా, ఎక్కడా విశ్రాంతి తీసుకోకుండా నడిచాడు. కాని, ఎండ వేడి తీవ్రంకావడంతో వాడికి అంత బరువున్న డబ్బు మూట మోసుకుంటూ నడవడం చాలా శ్రమ అనిపించింది. ఎక్కడైనా కొంతసేపు విశ్రమిద్దామన్నా, దారికి అటూ, యిటూ కొద్దిపాటి ఖర్జూరపు చెట్లు తప్ప మరేమీలేదు. రసూల్ చాలీ చాలని ఆ చెట్ల నీడలో నిలబడి, తన తోలు సంచీలో వున్న నీరు తాగసాగాడు.

ఆ సమయంలో తాను వెళుతున్న మార్గం వెంటనే ఒక గుర్రపు రౌతు వస్తున్నాడు. అతడు తనను సమీపించగానే రసూల్ అతణ్ణి పలకరించి, "మీరెక్కడికి వెళుతున్నారు?" అని అడిగాడు.



రౌతు గుర్రాన్ని ఆపి, "అదుగో, ఆ కనబడుతున్న గ్రామం మీదుగా నగరం పోతున్నాను. నేను నౌకరీ చేస్తున్నది, ఆ నగరంలోనే," అన్నాడు.

ఆ జవాబుకు రసూల్ సంతోష పడిపోతూ, "ఎంత అదృష్టం! ఆ గ్రామంలోని సత్రం యజమాని, నా బంధువు. భుజాన వున్న, యీ మూటను కాస్త, నీ వెంట తీసుకుపోయి ఆయనకిస్తావా? నేను చీకటి పడేలోపలే గ్రామం చేరి, ఆయన్నుంచి నా మూట నేను తీసుకుంటాను. దీన్ని మొయ్యడం కష్టంగా వున్నది," అన్నాడు.

రసూల్ మాటలువింటూనే రౌతు నవ్వి, "ఆ మూట మొయ్యడం, నీకు కష్టంగా

వుంటే, నా గుర్రానికీ కష్టంగానే వుంటుంది కదా ? మరేం అనుకోకు, మిత్రమా !'' అంటూ గుర్రాన్ని అదిలించి పరుగు తీయించాడు.

ఐతే కొంత దూరం పోయాక రౌతుకు ఒక ఆలోచన వచ్చింది. ఆ మూటను తీసుకోననడం బుద్ధిహీనతగా తోచింది అతడికి. ఒకవేళ ఆ మూటలో విలువైన వస్తువులేమైనా వుంటే, గ్రామంలోని సత్రం దగ్గిర ఆగకుండానే, ఆ మూటతో సరాసరి నగరానికి గుర్రాన్ని దౌడు తీయించవచ్చు!

ఇలా అనుకుని రౌతు గుర్రాన్ని వెనక్కు తిప్పి, రసూల్ దగ్గిరకు రాసాగాడు. అదే సమయంలో రసూల్ కూడా ఆలోచనలో పడ్డాడు. తను చాలా బుద్ధిమాలినవాడై వుండాలి! అలాకాకపోతే, పదేళ్ళపాటు ఎన్నో శ్రమలకోర్చి సంపాయించిన డబ్బు మూటను, ముక్కూ మొహం ఎరగని వాడికి యివ్వబోవడం ఏమిటి ? ఒకవేళ వాడు దురాశ కొద్దీ మూటతో పారిపోతే తనేం చెయ్యగలడు ? పదేళ్ళపాటు రేయనక పగలనక నానా కష్టాల కోర్చి సంపాయించిన డబ్బును, మరి కొద్ది గంటల పాటు తాను మోయలేడా ?

రసూల్ యిలా ఆలోచిస్తూండగా, రౌతు అతణ్ణి సమీపించి, ''మిత్రమా ! నువ్వడిగిన సహాయం గురించి మరొక సారి ఆలోచించి చూశాను. నీకు సహాయ పడడమే అన్నివిధాలా ధర్మం అనిపించింది. ఆ మూటను యిటు యివ్వు !'' అన్నాడు.

రసూల్ వెంటనే, ''మిత్రమా ! నేనూ మరొక సారి ఆలోచించి చూశాను. నా మూటను నేనే మోసుకుపోవడం క్షేమమనిపించింది. నేను కొంత తొందర పడ్డాను ; నువ్వు కొంత ఆలసించావు !'' అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

ఇద్దరూ ఒకళ్ళ మనస్సులోవున్న దాన్ని మరొకరు గ్రహించారు. రౌతు మారు మాట్లాడకుండా గుర్రాన్ని వెనుదిప్పి వెళ్ళిపోయాడు.



# సూరయ్య తెలివి!

వీరయ్యకూ, సూరయ్యకూ ఒకరికంటె ఒకరు తెలివైనవాళ్ళమని నమ్మకం. ఈ విషయమై వాళ్ళు నిత్యం వాదులాడుకుంటూండే వాళ్ళు. ఒకసారి దారినపోయే దానయ్య వాళ్ళ తగువు పరిష్కరిస్తానని, "నేను, మీ యిద్దర్నీ ఒక ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పినవాడు తెలివైన వాడు. ఇద్దరూ చెప్పలేకపోతే, మీ యిద్దరూ తెలివితక్కువ వాళ్ళు; నేను తెలివైనవాణ్ణి. సరేనా ?" అన్నాడు.

"నేనీ పోటీలో పాల్గొనను," అని సూరయ్య వెంటనే అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

"చూశావా, మీ యిద్దరిలోకీ సూరయ్యే తెలివైనవాడు. నేను, నాక్కూడా తెలియని చిక్కుప్రశ్న అడిగి, మీ యిద్దరికన్న తెలివైన వాడిననిపించుకోవాలని పథకం వేస్తే, సూరయ్య అది కనిపెట్టేశాడు," అన్నాడు దానయ్య.

వీరయ్య అప్పటికప్పుడు సూరయ్య దగ్గిరకు వెళ్ళి, "ఆ దానయ్య నువ్వే తెలివైనవాడివన్నాడు," అని జరిగింది చెప్పాడు.

సూరయ్య ఆశ్చర్యంగా, "ఉన్నట్టుండి, నాకు కడుపునొప్పి వచ్చింది. అది చెప్పడం యిష్టం లేక, ఏదో అబద్ధం ఆడి వచ్చేశాను. అదే నన్ను తెలివైనవాణ్ణి చేసిందన్నమాట!" అన్నాడు.

"అలాంటి కడుపునొప్పి, రోజూ నాకూ వస్తుంది. కాని, మంచి సమయంలో రాదు. ఇంతకు ముందు నీకు బదులు నాకు కడుపునొప్పి వచ్చివుంటే, దానయ్య చేత నేనే తెలివైన వాడి ననిపించుకునేవాణ్ణి !" అంటూ బాధపడ్డాడు వీరయ్య.

—శ్రీరామకమల్



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Prasad



M. C. Morabad

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మేమూ బట్టలు వేస్తాం! రెండవ ఫోటో: నీ వేషానికో సలామ్, నేస్తం!

పంపినవారు: జి. ఆర్. ఆర్. బాబు, నారాయణగూడా, హైదరాబాద్.

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు

1. ఫెర్డినాండ్ మేగాలిన్ 2. జావాట్రెంచ్ 3. పాక్ జలసంధి 4. దక్షిణ అమెరికాలోని అమెజాన్ నది 6. లైబర్ నది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రీటా మీ కేశ సంరక్షణ



జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.

ఒక మొటిమ వచ్చిందంటే చాలు దాంతో మరొకటి
అందుకే మీకు కావాలి ప్రత్యేక చర్యగల కొత్త, ఎక్కువ ప్రభావం గల క్లియరసిల్.

# కొత్త, ఎక్కువ ప్రభావం గల
# క్లియరసిల్
# మొటిమల్ని పోగొడుతుంది
# దాంతో బాటే యిక
# వాటిని పాకకుండా చేస్తుంది

ఏంటీ-బేక్టీరియల్
ట్రయక్లోసిన్ గలది



పెరిగే వయసులో మొటిమలు రావడం సహజం. మీకు యవ్వనం అంకురిస్తూన్న దశలో, అవి వచ్చి, పోతూవుంటాయి. అయితే వాటిని గురించి అసలు పట్టించుకోకపోయినా లేదా వాటిని గూర్చి తెగ బాధపడి పోయినా అవి అలా మాయమైపోవు యిక. మరి మోటుగా, గోళ్ళతో నొక్కి చిదిపి పారేస్తేనూ లాభం లేదిక. పైగా దానివల్ల జరిగేదేమిటంటే అది అంటువ్యాధై పెరిగి, పాకి, ముఖంపైన మరిన్ని మొటిమలు తయారవుతాయి దాంతో.

**ట్రయక్లోసిన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, అత్యంత ప్రభావంతో ఎలా పనిచేస్తుందో చూడండిక:**

కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమల్ని పోగొట్టడమే కాకుండా, వాటినిక పాకకుండా చేస్తుందిక. ఎందుకంటే, దీన్లో ప్రత్యేకమైన 'ఏంటీ-బేక్టీరియల్' ఔషధం ఉంది గనక, ట్రయక్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమలను కలుగజేసే బేక్టీరియాను పెరగకుండా ఆపు చేస్తుంది. అంతేగాకుండా మిగతా చర్మానికి అంటువ్యాధి సోకకుండా కాపాడుతుంది. మరి అందుకే మీ మొటిమలిక పాకవు.

**కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌తో అత్యుత్తమ ఫలితాలను పొందే విధానం**

మొట్టమొదటగా, మీ ముఖాన్ని కడుక్కోండి. ఆ తర్వాత మీ ముఖం అంతటిపైనా కొత్త, ఎక్కువ ప్రభావం క్లియరసిల్ రాసుకోండి.

మొటిమలున్న చోట మరింత ఎక్కువగా రాసుకోండి. అత్యుత్తమ ఫలితాల కోసం, కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌ని క్రమం తప్పకుండా ప్రతిరోజూ, రోజుకు రెండుసార్లు పొద్దున, ఉదయమూ, రాత్రి కూడా కొంతకాలం పాటు వాడుతూ ఉండాలి.

**ట్రయక్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌లోని అద్వితీయమైన 3-విధాల చర్య**



**మొటిమలను తెరుస్తుంది**
దీనిలోని ప్రత్యేకమైన రసాయనాలు మొటిమలపై పొక్కుల్ని ఒలిచేస్తాయి.



**బేక్టీరియాను ఎదుర్కొంటుంది**
కొత్త ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌లోని ఏంటీ-బేక్టీరియల్, ట్రయక్లోసెన్, మొటిమలు రేగి, వాటిని పాకేలా చేసే బేక్టీరియాను ఎదుర్కొంటుంది.



**మొటిమలను ఆరబెడుతుంది**
అధికంగా ఉండే నూనెను పీల్చి, మొటిమల్ని ఆరబెడుతుంది.

కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్ ముఖంపై గల నల్లపొక్కుల్ని మెత్తబరిచి వాటిని ఊడేలా చెయ్యవచ్చు కూడాను.




క్లియరసిల్ వేనిషింగ్ మెడికేషన్
కూడా దొరుకుతుంది.

OBM/3558 TEL



# JOIN THE MALTOVA CLUB!

## ఎక్కువ హోదాలను, పెద్ద బహుమతులను తెలియపరచే గ్రేడ్ :

☆ ఏ 3 (అందులో రెండు ఒకటే అయినప్పటికీ) గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు మాల్టోవా క్లబ్‌లో మాల్టోవా ప్రయివేట్ ర్యాంక్ మరియు బ్యాడ్జ్, ఐడెంటిటీ కార్డు.

4 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు-మాల్టోవా ప్రయివేట్ ర్యాంక్ మరియు ఒక ఫ్రిస్బీ.

5 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు, మాల్టోవా కార్పొరల్ ర్యాంక్ మరియు ఒక క్రికెట్ బ్యాట్ లేక బ్యాడ్మింటన్ సెట్



6 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు మాల్టోవా కెప్టెన్ ర్యాంక్ మరియు మావర్ స్పోర్ట్స్ సైకిల్ బియస్ఏ-ఎస్ఎల్ఆర్.

### పిల్లలకొక మహాద్భుత శుభవార్త

స్లోగన్ వ్రాయనక్కర లేదు. ప్రవేశ రుసుము లేదు. చేయవలసిందంతా ఇదే.

మీ ప్రియమైన ఆరోగ్య పానీయం మాల్టోవా 500 గ్రాముల జార్లను మూడు కొనండి. ప్రతి 500 గ్రాముల జార్ లోపల ఒక మాల్టోవా గ్యాంగ్ మెంబర్ బొమ్మ ఉంటుంది. అటువంటివి 6 బొమ్మలు, 5 పిల్లలవి, ఒకటి తమాషా ఏనుగు మాల్టోవా బొమ్మ చిత్రాలుంటాయి. ఈ బొమ్మలను కట్ చేసి, మాల్టోవా గ్యాంగ్ బొమ్మలను సేకరించండి. 3 బొమ్మలతో, మాల్టోవా సభ్యత్వం లభిస్తుంది. ఎంతో ప్రత్యేకమైన ఒక బ్యాడ్జీ, ఒక గుర్తింపు కార్డును చేజిక్కించుకోండి. 3 సేకరించిన తర్వాత విరమించవద్దు. ఎంత ఎక్కువగా సేకరిస్తే అంత పెద్ద మెంబర్‌షిప్ ర్యాంక్, అంత ఎక్కువగా బహుమానాలు లభిస్తాయి.

క్లెయిములు చేరటానికి ఆఖరి తేదీ 31 డిసెంబర్ 84
సభ్యత్వానికి, బహుమతులకి, బొమ్మల సెట్‌ను మీ పేరు అడ్రస్సు ఇంగ్లీషులో వ్రాసి (పెద్ద అక్షరాలలో) పంపండి.




**The Maltova Club**
Jagatjit Industries Ltd
5th floor, Bhandari House
91 Nehru Place New Delhi 110 019.

**JIL JAGATJIT INDUSTRIES LIMITED**

## విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

ISIMOES-D/JIL/CP/84/TEI

ప్రథమ చికిత్స తాలుకు వార్త!

# గుండ్రానివీ, పట్టీలూ

## కేవలం బ్యాండ్-ఎయిడ్ మాత్రమే వీలైన యీ ఆకారాల్లో వస్తుంది







గుండ్రటి డ్రెసింగ్,
మరేదీ సరిపడదు దీనికి

చదరపు డ్రెసింగ్,
మరేదీ పట్టుకోదు అలా




**బ్యాండ్-ఎయిడ్**

మరింతగా కాపాడేది, మరింత త్వరగా మాన్పేది.

Johnson & Johnson

OBM/3810 TEL

# పక్షపత్రికగా

# విజయచిత్ర

పందొమ్మిది సంవత్సరాలుగా తెలుగు సినిమా పరిశ్రమకూ —
పాఠకులకు వారధిగా నిలచిన మీ అభిమాన
మాస పత్రిక

## విజయచిత్ర

రాబోయే జనవరి నుంచి
పక్ష పత్రికగా రానున్నది!






చందా వివరాలకు :

పబ్లికేషన్స్ మేనేజర్, విజయా బుక్‌హౌస్,
చందమామ బిల్డింగ్స్, వడపళని,
మద్రాసు - 600 026

# అమిత్ లెఖ్ఖలు బాగా చేస్తాడు
# అలాగే అతని జామెట్రీ బాక్స్ కూడా.




## అతనూ, అతని జామెట్రీ బాక్స్
## కలిసిపోయిన రెండేళ్ళుగా పనిచేస్తున్నాయి.

కెమెల్ జామెట్రీ సెట్‌లు చిరకాలం మన్నేలా రూపొందించబడింది. అవి గట్టివి, ఎలా వాడినా పాడయి పోకుండా నిలిచేవి.

అవి ఎంతో నిశితమైనవి కూడా. ఫలితంగా లెఖ్ఖల్లో విజయానికి హెచ్చు తగ్గులేకపోవడం ముఖ్యమని మీ పిల్లలు నేర్చుకుంటారు.

వీటికి పెట్టాల్సిన ధర మరి కొంచెం ఎక్కువే. అయితేనేం, ఒక్కొక్కప్పుడు పొదుపు చేసేందుకు కూడా కొంచెం ఎక్కువ ధర పెట్టాల్సివస్తూ ఉంటుంది. కెమెల్ చిరకాలం నిలిచే మదుపుకు, ఎంతోకాలం ఉండేలా ఆధారం.

**కెమెల్** జామెట్రీ బాక్స్



కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
బొంబాయి-400 059 (ఇండియా)

VISION/TEL/811

**Results of Chandamama Camlin Colouring Contest No.37 (Telugu)**

*1st Prize:* P. Sreenivas, Vijaywada-1. *2nd Prize:* C. Shantha, Secunderabad. Kumari Aruna bai, Hyderabad. Kambhumpati Sivasai Krishna, Kakinada-533 006. *3rd Prize:* M.V. Shilpi, Warangal. T. Amy Diane, Ongole. Lakkoju Gouri Sankar, Rayagada. R. Venkat Krishna, Kallapur. K. Kondal Rao, Hanmakonda. D. Sarwani, Vizag-17. V. Vijaya Kumar Reddy, Yerraguntla. G.V.S. Prasad, Guntur. R. Ashok Kumar, Medak-502 101. P. Srinath, Adoni.

# అంతా చాకొలెట్‌మయం ప్రతి ఒక్కరి ఇష్టమయం!

nutrine
chocolate
Eclairs
more milk
more butter
more chocolate















CLARION/NC/8421

భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు